జూన్‌లో విడుదల

పక్షిరాజా వారి ...

# ఒక తల్లి పిల్లలు



చమ్రియా రిలీజు

BHARAT STUDIO

# రీటా హెయిర్ టానిక్



రీటా కురుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటికురులను పెంచే అద్భుతమైన హెయిర్ టానిక్. తల పెంద్రుకలు రాలుట, చుండు, బట్టతల మొదలైన కురుల వ్యాధులకు రీటా అమోఘమైనది. మీరుకూడ నేటి నుండియే రీటా వాడుడు. ప్రతిచోటా దొరకును.




**RITA**
**HAIR TONIC**

# బహిష్టు

"దేవీ మాత్రలు" (Registered by the Central Drugs Laboratory Govt. of India under No. CDL/688) ఏ కారణమువల్లనైనను, ఎన్ని నెలలుగా నైనను ఆగిన బహిష్టును అతిశీఘ్రముగాను గ్యారంటీగాను అతిసులభముగాను వెంటనే జారీచేయును. వేనకువేలు ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల దివ్య ఔషధము. నకిలి మందులను వాడి మోసపోకుడు. ధర (Ordinary) రు. 8-8-0. (Special) కొన్నినెలలుగా ఆగినవాటికి రు. 10-8-0. వి. పి. పి. ప్రత్యేకము.

# గర్భనిరోధం

"స్పెక్ పిల్సు" (Regd No. 266) సంతానము కోరని వారు 12 రోజులు సేవించిన శాశ్వతముగా 6 సం॥ లకు గర్భము కలుగదు. బహిష్టు మామూలుగా ఔతూవుంటారు. వేనకువేలు ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల ఔషధము. ధర రు. 12-0-0. వి. పి. పి. ప్రత్యేకము.

**SEENU & COMPANY**

POST BOX NO. 1638 ( ) MADRAS-1

బ్రాంచి: సింగపూరు. ఏజంట్సు: కావలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౨] జూన్ 1953 [సంచిక ౬

# వి ష య సూ చి క



# అశ్రుతర్పణం

పూజ్యులు శ్రీ కే. యస్. కేసరిగారి నిర్యాణం మనకు పితృలోపంవంటిది. వాత్సల్యముతో తన బిడ్డ 'గృహలక్ష్మి'తో బాటు మనపురోభివృద్ధికి వారు చేసినకృషిని, సహాయమును మనము తరతరాలకు మరువలేము.

వారి ఋణం తీర్చుకోడానికి ప్రేమానురాగాలను, ఉదారహృదయాన్ని స్మరిస్తూ వారి పవిత్రాత్మకు పరిపూర్ణశాంతిని సమ కూర్చవలసినదిగా భగవంతుని ప్రార్థించడముకంటే మనము చేయగలిగిందేమున్నది? వారి ఉత్తమ లక్ష్యాలు, ఆదర్శాలు, ఆదర్శప్రాయమైన జీవితము మానవకల్యాణాన్ని ప్రోత్సహించ గలవని మానమ్మకం.

కేసరి కుటీరం లిమిటెడ్.



# తండ్రికి కరువైపోయింది



శ్రీ కేసరిగారు, మొదటిభార్య కనకమ్మ

ఈ నెల 8వ తేదిన ఉదయం 7 గంటలకు పూజ్య బాబు కేసరిగారి నిర్యాణంవలన అల్లారుముద్దుగా వారి చేతుల్లో పెరిగిన బిడ్డలకు, తమ పురోభి వృద్ధికి నలుముఖాలతోడ్పడిన ఆంధ్ర నారీ లోకానికి తీరని కరువేర్పడింది.

ముఖ్యంగా 25 సంవత్సరముల క్రిందట జన్మించి కొరతఅనేది లేకుండా సర్వాంగ సుందరంగా దినదిన ప్రవర్థ మానమగుచు, ఆంధ్ర ప్రజాభిమాన మునకు పాత్రమగుచు విరాజిల్లుచున్న 'గృహలక్ష్మి'కి తన తండ్రిగారి నిర్యా ణంతో ప్రపంచము కారుచీకట్లు క్రమ్మింది; దుఃఖాతిరేకంతో కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నదంటే విశే షము ఏమున్నది? తండ్రిలేని కొరత బహుదొడ్డదికదా!

శ్రీ కేసరిగారి కవి, పండిత విద్వాంసుల సన్మానాలు, దానధర్మాలు మరపుకు రానట్టివి. కూటికి, గుడ్డకు, తలదాచుకోడానికి యిండ్లకు కరువైనవారికి అనేకమందికి ఉదారహృదయంతో వసతులు కల్పించారు. దయానుగ్రహములకు పాత్రులైనవారికి అయినవారికి, కానివారికికూడ విద్యాదానంచేశారు. అనేక సంస్థలు వారి భూరి. విరాళములతోపుట్టి మద్రాసు నగరంలో యశోవంతంగా వరిల్లుచున్నవి. జాతీయ, ఆంధ్ర ఉద్యమాల వ్యాప్తికి వారి తోడ్పాటు నగరంలో అమూల్యమైనది. నగరంలోని తెలుగు బాలబాలికలకు వారు స్థాపించిన కేసరి విద్యాలయములు మహోపయుక్తమే కాక తెలుగువారికి గర్వకారణమయినవి.

ఆ గర్భశ్రీమంతులుకారు శ్రీ కేసరిగారు. తెలుగు సీమలోని కుగ్రామమునుండి మద్రాసు నగరానికిచేరి జీవితయాత్ర ప్రారంభించిన నిరుపేద. అచంచలమైన ఆత్మబలం



శ్రీ కేసరిగారు, భార్య మాధవి అమ్మ, కుమార్తెలు శారద, వసంత కుమారి, మరదలు కాత్యాయని, అల్లుడు బాలకృష్ణగారలు

తోటి స్వయంకృషివలన 'కేసరి కుటీరం' అనే పేరుతో ఔషధశాలను స్థాపించి అందులో లోధ్ర, అమృత, అర్క మొదలగు ఔషధములను తయారుచేసి అమ్మి షుమారు 50 సంవత్సరములలో ముఖ్యంగా వేలకొలది స్త్రీలకు ఆరోగ్యసౌభాగ్యములను సమకూర్చడంతోపాటు లక్షలకొలది ధనం ఆర్జించారు. అలా ఆర్జించిన ధనమును మొత్తం స్వప్రయోజనాలకే కాకుండా ప్రపంచకళ్యాణానికి, అభ్యుదయానికి వినియోగపరుస్తూ దానివలని సత్ఫలితాలను స్వయంగా చూచి ఆనందించకలిగిన ధన్యజీవి.

శ్రీ కేసరిగారు 'రాజర్షి' అన తగినవారు. ప్రభువుగా గుర్తించడానికి రత్న, మణిమయ ఖచితకిరీట మొక్కటే తక్కువ. ఆయన అనుభవించిన రాజభోగాలు, అలవాటుపడిన మర్యాదలు, గడపిన జీవితవిధానం — ఆహారవిహారాదులందలి పోకడలు, నిర్మించిన భవనాలు రాజఠీవికి ఏమాత్రము తీసిపోవు. అంతమాత్రంచేత ఆయనను భోగలాలసుడనలేము. రాజభోగిగా, విలాసిగా జీవితానుభవము ఎంతయున్నదో నిరుపేద జీవితమందలి కష్టనిష్ఠూరాలనుగురించి అంతగా నెరిగినవారు. కాబట్టే సానుభూతితో కష్టదశలోనున్న అనేక కుటుంబాలకు సహాయంచేశారు. రాచనగళ్లలోను, భవనములలోని జీవితమందు ఎంత ఆసక్తియుండినదో పూరిపాకయందలి జీవితంయెడల కూడ అంత ఆసక్తి చూపినవారు కాబట్టే తాంబరంలో కొంతకాలం పర్ణశాలలో నివాసమేర్పరచుకున్నారు.

భగవతార్చన గంటానాదంతోటి పూజ్యబాబు కండ్లు విప్పారి కండ్లవెంట బొటబొట నీరు కారాయి. ఆయన చూపు "ఇక నేనీబాధపడలేను; వెళ్లిపోతున్నాను" అంటూన్నట్లనిపించింది. మరుక్షణంలోనే ఆత్మారాముడు అనంత విశ్వంలో కలిసిపోయాడు.

పూజ్యబాబు జీవితం శ్రీమంతులకు ఆదర్శప్రాయమయింది. వారి పవిత్రాత్మకు సుస్థిరమైన శాంతి సౌఖ్యాలను ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తాము.



# లోక బాంధవుడు శ్రీ కే. యన్. కేసరి గారు



మహనీయులు, ఆంధ్ర ప్రముఖులు, సంఘ సంస్కర్తలు, పత్రికా సంపాదకులునగు కేసరిగారస్తమించినారన్న వార్త తే 9-6-53 దీ ఆంధ్రప్రభలో చూచిన తరువాత నాహృదయము దిగ్భ్రాంతి చెందినది. ఒళ్ళు చెమ్మగిల్లినది. అప్రయత్నముగా అశ్రుధారలు నేత్రద్వయమునుండి జారినవి.

ఆయన మరణించినారనిన నాకాశ్చర్యముకలిగినది. ఆయనకాదు మరణించుట. ఆయన భౌతికకాయము మాత్రమే. ఆయన శాశ్వతకీర్తికాములు. ఆయన కీర్తిస్థిరస్థాయిగా యీ భూమండలమున వుండిపోగలదు. ఆ మహనీయుని జీవిత చరిత్రచదివి నేటి యువకాయువకులు నేర్చుకోవలసిన వెన్నియోగలవు. కేవలం బీదరికంతోనే మద్రాసు వచ్చి, తన స్వశక్తివల్ల, కార్యదీక్షవల్ల యింత ఘనత సంపాదించిన అతని జీవిత విషయాలు ప్రతి ఆంధ్రుడు చదివితీరాలి.

నిజంగా కేసరి అన్న పేరు పెట్టుకున్నందుకు ఆంధ్ర కేసరి పేరుకుతగ్గ మనిషి. ఆంధ్రులకు సింగమువంటివాడు. అలాగని క్రూరస్వభావులుకారు. శాంతికాములు. వుదారగుణపూరితులు. గొప్పదాతలు. సంఘ సంస్కర్తలు. వారిని వెనుదీయని సాహసము. నిరుత్సాహపడని ధైర్యము. తన కార్యముసాధించినవరకును పట్టినపట్టువిడువరు. ఆ గుణములే వారికింత ఘనతకు తెచ్చినవి. ఆయన సంఘసేవ వీరేశలింగం పంతులుగారిని జ్ఞప్తికితెచ్చును. ఆ నాడు వీరేశలింగం పంతులుగారు స్త్రీ జనాభ్యుదయానికై పాటుపడినారు. యీ నాడు స్త్రీ జనాభ్యుదయానికి అనేక ఘనకార్యములుచేసి తన జీవితమంతా స్త్రీల పురోభివృద్ధికే అర్పించినవారు యీనరకేసరి. ఘనతకెక్కిన యిద్దరు సంఘసంస్కర్తలను మన ఆంధ్రభూమి కోల్పోయినది. వారు స్త్రీలకుచేసినసేవ యింతంతయని చెప్పనలవికాదు. వైద్యరూపమునను, పత్రికలరూపమునను, పాఠశాలల రూపమునను వారి ధాతృత్వము ప్రకటించుకొనిరి. మనకు ఆంధ్ర రాష్ట్రావతరణ సమయములో అటువంటి మహనీయుల ఆశీర్వాద భాగ్యము లేకపోయినందుకు చాలా విచారించవలసివస్తున్నది. అది ఆంధ్రుల దురదృష్టమే అనుకొనవచ్చు. సంఘసంస్కర్తలుగా పేరెన్నికెక్కిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు చిరస్మరణీయులు. వారి తరువాత సంఘ సంస్కర్తలుగా పేరు మోసినవారు యీ నరకేసరియే. వారి పేరు ఆంధ్రుల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది. చిన్నప్పుడు దరిద్రదేవత యొడినుండి యెటులో తప్పించుకొనివచ్చి, అదృష్టదేవతయొడిలోపడి అఖండకీర్తి నార్జించిన ఆ మహనీయునకు యీనాడు మృత్యుదేవత యొడిలో పడకతప్పిననికాదు. మానవజీవితము యింతియేకదా! లోకంలో యేదీ శాశ్వతముకాదు. కీర్తిప్రతిష్టలే మనకు చిరస్థాయిగా వుండిపోతాయి.

నేను గృహలక్ష్మికి యెప్పుడు కథలు వ్రాసినను ఆయనను పితామహునిగను, గురుదేవునిగను భావించి, మనస్ఫూర్తిగా ధ్యానించి తదుపరి కథాక్రమమున కుపక్రమించెదను. ఆంధ్ర దేశముయొక్క అమూల్య రత్నమును కోల్పోయినందుకు ఆంధ్రులు ఎంతయో విచారిస్తున్నారనుట అతిశయోక్తిగాదు. నిశ్చింతాక్రాంతులు, నిత్యభక్తులు నగువారి ఆత్మకు భగవంతుడు శాంతిచేకూర్చుగాక! వారి కుటుంబమును, బంధుమిత్రులను సదా ఆ భగవంతుడు రక్షించవలెనని ప్రార్థించుచున్నాను. వారు స్థాపించిన గృహలక్ష్మి పత్రిక అఖండఖ్యాతి నార్జించుకొని, లోకంలో స్థిరస్థాయిగా వుండవలెనని నేనా దేవుని కోరుచున్నాను.

ఎన్. కామేశ్వరరావు.

# ఆదర్శజీవి శ్రీ కేసరిగారు



డాక్టరు కేసరిగారు 8-వ తేదీ ఉదయం 7 గం॥కు కీర్తిశేషు లయ్యారని విని నేను చాలా విచారించాను. ఆయన మృతివల్ల ఆంధ్ర దేశానికీ, మహిళా లోకానికీ తీరని లోటు వాటిల్లినది. అక్షరలక్షలిచ్చి భోజుడు సంస్కృతాన్ని సాకేడు; పెరికిల్స్ కాలంలో గ్రీకుభాష బాగా వర్ధిల్లింది; అగస్టసు లాటిను భాషని ఎంతో చాకచక్యంతో పోషించేడు; ఎలిజబెత్తు కాలంలో ఆంగ్లభాష మహోన్నతదశనందినది; శ్రీ కృష్ణ దేవరాయల కాలంలో ఆంధ్రభాష దేదీప్యమానంగా వెలిగింది. ఇంతమంది మహానుభావులు వాళ్లవాళ్లభాష అభివృద్ధికని ఎంతోమంది పండితుల్ని, కవుల్ని పోషించినా ఎవరూ ప్రత్యేకంగా స్త్రీలని ఆదరించలేదు. ఆ గౌరవము శ్రీ కేసరిగారి ఒక్కరికే దక్కినది. ఏ స్త్రీలోనైనా ఏమాత్రం సామర్థ్యం కనుపించినా కవనంలోనైనా, పాండిత్యంలోనైనా, సాంఘిక సేవయందైనా, గానకళయందైనా ఆఖరికి పాకకళయందైనా ఆమెకు తక్షణం స్వర్ణకంకణాన్ని బహూకరించేవారు! ఈ ఔదార్యం ఎంతమందికి గలదు! చిన్నప్పుడు తను ఆకలిగొన్నప్పుడు తనకు ఎంతో ఆప్యాయతతో అన్నమిడిన అమ్మల అమృత హస్తాల్ని అలంకరించే నిమిత్తమై స్వర్ణకంకణాల్ని ప్రతిసంవత్సరమూ వారికి బహూకరిస్తున్నట్లుగా ఆయన గృహలక్ష్మి జయంత్యుత్సవాలలో రెండుమూడు సార్లు చెప్పగా నేను విన్నాను. ఆ మాటల్ని వినగానే నా ఒళ్లు జలదరించింది. ఎంతటి మహోత్కృష్టమైన ఆశయము!

'పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా' అన్నట్లుగా మనదేశంలో ఎంతోమంది ధనికులున్నారు. వీరిలో ఎంతమంది దేశానికీ, తమతోటి మానవులకీ సహాయపడగలుగుతున్నారు? మదరాసులోని తెలుగు బాల బాలికలకు తెలుగుబడిలేదనే కొరతని శ్రీ కేసరిగారు తీర్చేరు. రెండు చక్కని ఉన్నత పాఠశాలలు వెలసేయి. అవి శ్రీ కేసరిగారిని అమరజీవిగా చాటగలుగుతాయి! నిష్కళంకమైన, ఆదర్శప్రాయమైన వారి జీవితానికి అవి అద్భుతమైన స్మారక చిహ్నాలు! లోధ్ర, అమృత, అర్క వారు నానా వ్యాధులకూ గురికావలసిన మానవ లోకానికి, అర్పించిన దివ్యాంజనాలు. 'గృహలక్ష్మి' వారి అనుంగు పుత్రిక! ఆయన ధన్యజీవి! ఆయన ఆత్మకు శాంతి! నొసగవలసినదిగా] పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను. వారి కుటుంబానికి నాసానుభూతుల్ని తెలియజేయవలసినది.

ఇట్లు భవదీయ

సో. రామచంద్ర అగస్త్య

# కీ. శే. డాక్టర్ కే. యన్. కేసరిగారి కొన్ని జీవిత విశేషాలు

శ్రీ కేసరిగారి అసలుపేరు కోట నరసింహయ్య. గుంటూరుజిల్లా ఒంగోలు తాలూకాయందలి ఇనమన మెళ్లూరు గ్రామంలో 1875 సం॥ ఏప్రియల్ నెల 26-వ తేదిన కడుబీద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు.

తండ్రి చిన్నతనంలోనే చనిపోయాడు. నివసిస్తూ యున్న పూరియిల్లు పయితం పడిపోయింది. మేన మామ ములుకుట్ల మహాదేవయ్య తన సోదరిని, మేన ల్లుణ్ణి కొంతకాలం తనయింటనుంచుకొని పోషించాడు. తన పెద్ద కుమార్తె కనకమ్మను మేనల్లునకిచ్చి వివాహం చేసి కన్యాదానఫలం దక్కించుకొన్నాడు.

స్వగ్రామంలోనే ప్రాథమిక విద్యాభ్యాసము పూర్తిచేసికొని తల్లిని వెంటబెట్టుకొని శ్రీ కేసరిగారు జీవనోపాధికొరకు మద్రాసు నగరంచేరారు. స్థానిక వర్తక ప్రముఖుల ఆదర సహాయాలతోటి, హిందూ థియాలాజికల్ హైస్కూలులో విద్యనభ్యసించి ఆయుర్వేదవైద్యవిద్య నభ్యసించారు. కన్యకా పరమేశ్వరి ధర్మసంస్థ నడుపుతూవచ్చిన ఆయుర్వేద వైద్యాలయంలో కీర్తిశేషులైన పండిత డి. గోపాలా చార్యులగారితోబాటు పనిచేసారు. 1900 సం॥లో స్వంతంగా కేసరి కుటీరాన్ని స్థాపించి తమకుగల వైద్యంలోని వైదుష్యంవలనను, వ్యాపారమునందలి చాకచక్యంవలనను, అచంచలమైన ఆత్మబలంతో స్వయంకృషి నాధారముగాకలిగి ఆయుర్వేద వైద్య విధానంలో మందులు తయారుచేసే మహోన్నత సంస్థగా రూపొందించారు.

మొదటిభార్య కనకమ్మగారివలన సంతానంలేదు. రెండవభార్య మాధవి అమ్మగారివలన నొక కుమార్తె. పేరు శారద.

షుమారు 60 సంవత్సరములలో విశేషంగా ధనం ఆర్జించారు. ఆర్జించిన దానిని పూర్తిగా స్వప్రయోజనాలకేకాక అనేక విధముల లోకకల్యాణమునకు వినియోగించారు. వారుచేసిన గుప్తదానములనేకములు. అవి కీర్తి ప్రతిష్టలకు మాత్రము ఉద్దేశించ బడినవికావు, మహిళా పురోభివృద్ధికిగాను, అనాథలకు అనేకమందికి చదువు సంధ్యలు చెప్పించి జీవనోపాధి కల్పించారు. అనేక శరణాలయాలకు, విద్యాలయాలకు విశేషంగా ధనసహాయంచేశారు. మహిళా లోకంలో విద్య, విజ్ఞాన వికాసాదులు పెంపొందడానికిగాను 25 సం॥లనాడు 'గృహలక్ష్మి' పత్రికను స్థాపించి స్వయంగా నిర్వహిస్తూ వచ్చారు. ఆయన కృషి మూలంగా మహిళా ఉద్యమము సర్వతోముఖంగా ముందంజవేసింది.

మద్రాసు నగరంలో ఆంధ్రదేశమునుండివచ్చిన అనేక పండితులను, విద్వాంసులను, చిత్రకారులను సన్మానించి ప్రాపకం సమకూర్చిన వారిలో ప్రముఖులు.

వారుచేసిన గుప్తదానములట్లుండగా 1943 సం॥ మైలాపూరు తెలుగు పాఠశాలను తన యాజమాన్యము క్రిందకు తీసికొని కేసరి విద్యాలయంగా దానిని రెండు సంవత్సరములలో హైస్కూలు స్థాయికితెచ్చి ఒక దివ్య భవనాన్ని, రు 50000 లు విరాళంగా నిచ్చారు. 1947 సం॥ ఆడపిల్లలకొరకని ప్రత్యేకంగా కేసరి కన్యావిద్యాలయం అనే పేరుతో నొక విద్యాలయ మును స్థాపించి లక్షరూపాయలు విరాళమిచ్చారు. దాని నిర్వహణకని ఏర్పాటుచేసిన విద్యా సంఘానికి సర్. అల్లాడి కృష్ణస్వామిగారిని ప్రెసిడెంటుగా చేశారు. విరాళము లివ్వడంతోబాటు నిర్వహణా వ్యవహారాలలో అత్యంతశ్రద్ధ చూపుతుండేవారు శ్రీ కేసరిగారు.

శ్రీ కేసరిగారి జీవిత రహస్యం — అచంచలమైన ఆత్మబలం, స్వయంకృషి, కార్యశూరత్వం. పైగా సత్ హృదయులు, మితభాషి.

ఆయన భోగపురుషుడు. రాజాస్థానాలలో రాజుల సరిపంక్తిన రాజగౌరవాలు పొందారు.

ఉన్నత అధికారులతోటి, విద్యావేత్తలతోటి స్నేహం చెయ్యడంతోబాటు సమాన గౌరవాలకు పాత్రులైనారు.

వారు కళాపిపాసి. లలితకళల అభివృద్ధికి వారు చేసినకృషి అపారం. సంగీతం, చిత్రకళ, వాస్తు శిల్పం, కవిత్వం మొదలగు వానియందభిరుచి మెండు. దానికి తార్కాణం వారు నిర్మించిన భవనాలు, వారు ఆదరించి ప్రోత్సహించిన సంగీత విద్వాంసులు, చిత్రకారులు, కవులు, కవయిత్రులు, ప్రతిఏటా బహూకరిస్తూవచ్చిన "గృహలక్ష్మి స్వర్ణకంకణము" మొదలైనవి.

'కష్టేఫలి' అనే విషయంలో చాల గట్టి నమ్మకం గలవాడు. సోమరితనాన్ని, విలాస జీవితాన్ని తన వారిలోను, బయటివారిలోను సహించేవాడుకాడు. ఆర్థికస్థితిగతిని బట్టి జీవితాన్ని రూపొందించుకోవాలని ఆయనసమ్మకం. తాను భోగియైనాడంటే తను చిన్నప్పుడు కష్టపడి జీవితరేఖలు రూపొందించుకొని నట్లే యితరులుకూడ రూపొందించుకోవాలనియు, అంతవరకు నిరాడంబరంగా జీవితం గడుపవల సిందేనని ఆయనవాదం.

శ్రీ కేసరిగారికి క్రమశిక్షణ, పద్ధతియందు ఆసక్తి మెండు. కాబట్టే తన యింట్లోను, సంస్థలోను, పద్ధతికి, క్రమశిక్షణకు భిన్నంగా నడచినవారిని ఏమాత్రము ఉపేక్ష చేసేవాడుకాడు.

ఆయన ప్రేమాభిమానములకు పాత్రులై జీవిత పురోభివృద్ధినితీర్చి దిద్దుకొన్న వేలాదిమంది యీనాడు భక్తి శ్రద్ధలతో కన్నీరు మున్నీరు కారుస్తున్నారు.

—— ——(o)—— ——

# శ్రీ కే. యన్. కేసరిగారి తుది ఘడియలు, అంత్యక్రియలు



ఈ నెల 8వ తేది ఉదయం 6-50 గంIIల వరకు సాధారణ నిద్రావస్థలోనే యున్నారు. అదే సమయంలో భవతార్చన జరుగుతున్నది. కర్పూరనీరాంజనంతోబాటు గంటానాదంతో కండ్లు తెరచి వెంబడి బొటబొట నీళ్లుకార్చారు. మరుక్షణంలో వారి చూపులోమార్పేదో కనుపించగా కండ్లుమూయబడినవి.

డాక్టర్ సి. ఆర్. కృష్ణపిళ్లై, మైదవోలు శేషాచలపతి, జస్టిస్ ప్రత్తిపాటి సత్యనారాయణరావు, డి. యస్. శర్మ, లేడీరాధాకృష్ణ, టేకుమళ్ల కామేశ్వరరావు, బండి శ్రీహరిరావునాయుడు, కె. జి మీనన్, శ్రీపతి రామమూర్తి, పండితారాధ్యుల నాగేశ్వరరావు డా. కస్తూరి నారాయణమూర్తి, డా. వి. నారాయణస్వామి, డా. శ్రీమతి గులాబిబాయి, డా. కె. కె. పిళ్లై, కేసరి విద్యాలయముల ఉపాధ్యాయ బృందం, యఫ్. కె. గుహ, యస్. టి. అరసు, జి. వెంకటాచారి, డా. డి. గోపాలాచార్లు, యమ్. విశ్వనాథ్ దంపతులు, డా. ఎ. జె. మేహతా దంపతులు, బి. వి. సి. నాయుడు మొదలుగాగల బంధువులు, స్నేహితులు, ఉద్యోగస్థులువచ్చి చివరసారి శ్రీ కేసరిగారి భౌతికదేహాన్నిచూచి తమభక్తి, గౌరవాలను వెల్లడించి వెళ్లిపోయారు.

మధ్యాహ్నం 1-30 గంIIలకు కృష్ణాంపేట స్మశానవాటికకు చేర్చబడి అశేష బంధుమిత్రుల సమక్షమున శ్రీ కేసరిగారి భౌతికదేహమునకు దహన సంస్కారాదులు గావించబడెను.



# రేడియో

## భోజనంవద్ద ముగమోటం

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

భారత స్త్రీల గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేసినవాటిల్లో అతిథి సత్కారం ఒకటి. మనపురాణేతిహాసాల్లోని ఆతిథ్యగాథలు చూస్తే వీని ఖ్యాతి విదితమవుతుంది. అనసూయ త్రిమూర్తులకుపెట్టిన భోజనమూ, ద్రౌపది శిష్య సహితుడగు దూర్వాస మహర్షికిచేసిన విందూ సుప్రసిద్ధాలు. ఆతిథ్యమంటే ఇంటికివచ్చిన బంధుమిత్రాదులకుగాని తదితర పెద్ద మనుష్యులకుగాని గౌరవ పురస్కారంగా భోజనం పెట్టడం అని చెప్పాలె. తన యింటికి భోజనమునకు వచ్చినవారిని ఇష్ట మృష్టాన్నములతో సంతృప్తి నొందించడమే ఆతిథ్యమనిపించుకుంటుంది. అతిథి కేది ఇష్టమో అది కుడువబెట్టినప్పుడే ఆ అతిథి సత్కారం సఫలమవుతుంది. పసిపాపలైన త్రిమూర్తులకు భక్ష్య భోజ్యాదులతో విందుచేస్తే వాళ్లేమి ఆరగిస్తారు. చిన్నమృణ్మయపాత్రతో వేడి వేడి బువ్వ మెత్తగా గుజ్జనగూండులాగా వండి వామూ ఉప్పో, పప్పూ పాలీ చింతకాయ పచ్చడో వేసి కమ్మని ఆవునెయ్యి వేసి గుజ్జుగాకలిపి ఆం తినమంటూ లాలిస్తూ తినిపిస్తేనే త్రిమూర్తులకు సరైన భోజనం పెట్టినదవుతుంది. అనసూయాదేవి నిజంగా సతీ అనసూయ బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు అటువంటి భోజనముపెట్టి ఉండాలె. లేకపోతే వారు అంతగా ఆమెయెడ ప్రసన్నులై ఉండరు.

పాండవులు అరణ్యవాసం చేస్తున్న రోజుల్లో కొద్దిగా పదివేలమంది శిష్యులతో దూర్వాసుడు ద్రౌపదికి అతిథిగా వచ్చాడు. దూర్వాసుడంటే ఎవరో మనకందరికీ తెలుసు. నాటినుండి నేటిదాకా లోకంలోని కోపధారులందరికీ నిజనామమునే బిరుదుగా ప్రసాదించిన ధూర్త మహర్షి అతడు. ఆ కోపోజ్జ్వల దివ్యమూర్తి అతిథిగా వచ్చాడని వినగా శ్రీ కృష్ణభగవానుడు ద్రౌపది ఒసంగిన ఏబలుసాకు పులుసుకూరో నలుసంత మెసవి షడ్రసోపేతమైన భోజనం చేసినట్టుగా సంతృప్తి చెంది శిష్యసహితుడగు దూర్వాస

మహర్షికి ఆతిథ్యమీయగల మహనీయశక్తి ద్రౌపదికి ప్రసాదించాడు కనుకగాని లేకపోతే మొగమాట మెఱుగని దూర్వాసుని శాపానికి ద్రౌపది ఇంధనం కావలసివచ్చేది. అటువంటి విషమ పరిస్థితులనుండి ద్రౌపదిని రక్షించాడు శ్రీకృష్ణుడు.

ఆ నాడేగాదు యీనాడూ ఇటువంటి విషమ పరిస్థితులు ప్రతి గృహిణికీ ఎదుర్కొంటూనే ఉంటాయి. ఇటువంటి పరిస్థితులను సమర్థించుకొన్న గృహిణే ఉత్తమ ఇల్లాలు. నిజానికి దేవుడికైనా మానవుడికైనా వారికిష్టమైనది వారికి ఆరగింపచేసినప్పుడే వారు సంతృప్తి చెందుతారు. చూడండి విఘ్నేశ్వరు డున్నాడనుకోండి ఆయనకు ఉండ్రాళ్లంటే మహాఇష్టం. ఇరవైవొక్క రకాల పత్రితో పూజించి ఇరవైవక్క ఉండ్రాళ్లు నివేదన చేస్తేనే ఆయన సంతృప్తి చెందుతాడు. ఎబ్బే గుండ్రాళ్లు లాగా యీ ఉండ్రాళ్లు నైవేద్యం పెట్టటమేమిటని ఇంతకూర, పూరీ ఇంట్లో తయారు చేశో హోటలునుండి తెప్పించో నివేదన చేస్తామంటే వల్లగాదు. విఘ్నేశ్వరుడు ఉగ్రుడై మనం తలపెట్టిన కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరకుండా చేస్తాడు.

చూచారూ ఇతరులకు భోజనం పెట్టడంలో ఎన్నో చిక్కులున్నాయి. భోజనం విషయంలో కొందరికి విధి నిషేధాలుంటాయి. కొందరికి భిడియమూ మొగమాటమూ ఉంటుంది. నిజంగా ఇంటికి వచ్చిన బంధుమిత్రాదులకు అన్ని మర్యాదలూ చేయడం ఒక యెత్తూ, భోజనం పెట్టడం ఒక ఎత్తూను. ఈ భోజనం విషయంలో తృప్తి పొందించడంలోనే ఉన్నది గృహిణి చాకచక్యమంతా. అన్ని వస్తువులు సమృద్ధిగా ఉండి వంటచేయడానికీ, ఇతర పనులు చేయడానికీ, నౌకరులున్న గృహిణికి ఒకరికి భోజన భాజనాదులు అమర్చడంలో అంత కష్టం లేదు. కేవలం దరిద్రుల యింటికి బంధువులు రావడమూ వారికి విశేష మర్యాదలు చేయడమూ అంతగా ఉండదు. ఇక కష్టమంతా మధ్యరకం కుటుంబాలకే. సహాయం చేయడానికి పనివాళ్లు ఉండరు. ఇంట్లో వస్తువులు సమృద్ధిగా ఉండవు, వచ్చిన బంధువుకో, మిత్రునికో సుష్టుగా భోజనం పెట్టాలె. అట్లా పెట్టకపోతే కుటుంబ గౌరవానికే లోపం. గృహిణీత్వధర్మానికే లోపం. కనుక ఆ వచ్చిన పెద్ద మనిషికి లక్షణమైన భోజనం పెట్టడానికి శతవిధాల ప్రయత్నిస్తుంది. గృహిణి యీ భోజనం పెట్టడంలో ఆ వచ్చిన పెద్దమనిషి ఉభయులకు ఇష్టుడూ కావలసినవాడూ అయితే అట్టే పేచీ లేదు. వ్యవహారం సమరసంగానే జరుగుతోంది; అట్లా కాకుంటా కేవలం భార్యకు మాత్రమే అయినవాడైతే ఇంటికి వస్తువులు రావు. భర్తకు మాత్రమే ఇష్టుడైతే ఇంటి ఆమె తలకు వాశెన కట్టుతుంది.

కనుక భార్యాభర్తలిరువురు సమరసభావంతో పెట్టే భోజనమే సొంపైనదీ ఇంపైనదీను. ఇంతవఱకు భోజనంపెట్టేవారి సంగతి ఆలోచించాము. ఇక భోజనం చేసేవారి సంగతి ఆలోచిద్దాం.

ఆహారంపట్లా వ్యవహారంపట్లా మొగమోటం పనికిరాదని సామెతఉన్నా సాధారణంగా పరాయి యింటి భోజనంచేసే సందర్భంలో చాలామంది మొగమోటమే పడతారు. వడ్డించిన వస్తువులన్నీ తింటేనూ, ఇష్టమైన వస్తువు మళ్లీ వేయించుకుంటేనూ, ఎవరేమనుకుంటారో అనే కొందరికి సంకోచంగా ఉంటుంది కనుక ఇష్టంవున్న వస్తువూ అవసరమైన వస్తువుకూడా 'వేయించుకోకుండా వద్దువద్దని చేయి అడ్డంపెట్టుతారు. ఈ సందర్భంలో వారు కలుపుకున్న వస్తువును ఒక కంట కనిపెట్టి వద్దన్నకొద్దీ వడ్డించే ఇల్లాలైతే యీ మొగమాటస్తులకు కడుపు నిండుతుంది. అట్లా వడ్డించకుండా వెనుకతీస్తే వారు అర్ధాకలితో లేవడమే తటస్థిస్తుంది. ఈ మొగమోటస్తులు పంక్తిని కూర్చుంటే బాగా భోజనం చేసేవాళ్లకీ చిక్కే. ప్రక్కన కూర్చున్నవాళ్లు అన్నీ వద్దువద్దని అంటూ ఉంటే తాము కావాలని వడ్డించుకుంటే వీళ్లేదో కరువును పడివచ్చినట్టున్నాడని ఎక్కడ అనుకొని పోతారో అని పంక్తిలోఉన్న వాళ్లందరికీ భయమే. అందువల్ల తక్కినవాళ్లుకూడా సగంతిండే తినడం సంభవిస్తుంది. ఒకనాడు ఒక గొప్ప యింటి అమ్మాయిలు ఒకచోటికి భోజనానికి వచ్చారు. వారి తిండే అంతేనో, లేక ఇంటివద్ద కొంత భోజనం చేసేవచ్చారో లేక మొగమోటమో, మరల తెచ్చిన వస్తువులు వడ్డించుకోకపోగా మొదట విస్తరిలో వడ్డించినవే పూర్తిగా తినకుండా కోళ్లు కొక్కిరించినట్టు కొక్కిరించి రవ్వంత నంజినట్టే నంజి కూర్చున్నారు. ప్రక్కన కూచున్నవాళ్లకు ఏది తినడానికీ, ఏ వస్తువు వేయించుకోడానికీ తిండిపోతులని ఎక్కడ అనిపోతారో అని చచ్చేభయమైపోయింది. వాళ్ల అవస్థ చూచి ఆ యింటి యిల్లాలు "వాళ్లు నాజూకు మంతులమ్రా వాళ్లనుచూచి మీరు బిడియపడపోకండని" కొసరి కొసరి మారు వడ్డించి తక్కినవాళ్లకు పుష్టుగా భోజనం పెట్టింది. విందు భోజనాల్లో ఇటువంటి తమాషాలెన్నో జరుగుతుంటాయి. కొంతమంది ఎవరియిల్లైనసరే, స్వగృహే అనుకొని ఎంతో ధారాళంగా తమకు కావలసిన పదార్థాలుచెప్పి చేయించుకొని లక్షణంగా భోజనం చేస్తారు. అటువంటివారితో ఏలాటి ఇబ్బందిలేదు. వెనుకటికి ఒకాయన ఉండేవాడు ఆయనకు మొగమాటమనేది కలికానికైనా ఉండేదికాదు. ఆయన ప్వారి నుంచి వస్తూనే సరాసరి వంటయింట్లోకి వెళ్లి ఇంటి యిల్లాలిని కుశల ప్రశ్నగా ఆ మాటా యీ మాటా అడిగి ఇదిగో అమ్మాయి ఇవ్వాళ కూరేమిటనేవాడు.

ఆమె బంగాళా దుంపలంటే చక్రాలు తరిగి వేయించమనో, వంకాయలైతే గుత్తికాయ చేయమనో ఆకుకూరైతే పప్పో వడియాలో వేసి చేయమనో పురమాయిస్తూ అమ్మాయి నూనె తగిలితే నాకు దగ్గువస్తుందిగాని నేతి పోపులే పెట్టమ్మా అనేవాడు. బావగారు భోజనానికి వచ్చేటప్పటికి ఏ వేళవుతుందో కాస్త పాలు ఎక్కువేసి డికాక్షన్ తక్కువేసి ఒక కప్పు కాఫీ తీసుకరా అమ్మా అనేవాడు. రాత్రిళ్లు మజ్జిగ పోసుకోను, ఒక పావుశేరు పాలు పోయించుకొని ఉంచమనేవాడు. ఇంక శనివారం రాత్రి భోజనం చేయను అనేవాడు. అంటే రాత్రికి ఏ ఫలహారమో చేయమన్నమాట. ఇంట్లో అన్నీ వస్తువులు ఉన్నయిల్లైతే ఇటువంటి వారితో ఏమీ కష్టంలేదు కావలసినవి అడిగి లక్షణంగా పుచ్చుకుంటారు. ఇది వారికీ సుఖమే ఇల్లాలికీ సుఖమే. ఇక ఇల్లాలికి వచ్చేచిక్కు అల్లుడితో ఆ అల్లుడైనా పాతవాడైతే పరవాలేదు. అమ్మాయి అతని రుచులన్నీ అవగతం చేసుకొని అమ్మా బంగాళాదుంపల ముద్దకూర ఆయన అసలే ముట్టుకోరు, ప్రతిపూట అప్పడం వడియం ఉంటేనేకాని వారు ముద్ద యెత్తరు. పట్టి పప్పులో ఊరు మిరపకాయలు కొరుక్కోవడమంటే వారికెంతో యిష్టం. చెన్నపట్నం చదువుకు వెళ్లినప్పటినుంచీ పెరుగు పచ్చళ్లూ మజ్జిగ పులుసులు వారికి బాగా అలవాటైనాయంటూ వివిధ విధాలుగా తన భర్తకిష్టమైన పదార్థాలు తల్లికి తెలియజెప్పి ఇష్టమైన వంటకములు తయారు చేయించి భర్తకు భోజనం పెట్టిస్తుంది. కొమార్తె కనుక పాత అల్లుడితో అట్టే కష్టంలేదు. అత్తగారికి కలిగే ఇబ్బంది అంతా క్రొత్త అల్లుడితోనే. అసలు అత్తగారికి కొత్త అల్లుడంటే మహా ముచ్చట. అందువల్లనే అల్లుడికిచేసిన సంబారమంతా కొడుకుకు పెట్టి కోలుపోయినానన్న సామెత పుట్టింది. అవును అల్లుడు వచ్చాడని ఒకటికి నాల్గు ఆధరువులుచేసి ఉంటుంది, ఆవిధంగా రోజూ ఇంట్లో ఉండే కొడుక్కుపెట్టితే కొంప దివాలేకాదూ. అందుకే ఆ సామెత వచ్చింది.

కొత్తగావచ్చిన అల్లుడికి ఏవి ఇష్టమో అత్తగారికి తెలియదు. అయితే ఆయనకిష్టమైనవే చేసిపెట్టవలెనని ఆమె అభిలాష. కనుక ఒక దుంపకూర వేయించి ఒక కాయగూర తిరుగబోతవేసి, ఒక తియ్యపచ్చడి పుల్లపచ్చడిచేసి పప్పుపులుసూ చారూచేసి అప్పడం వడియం ఊరుమిరపకాయలు వేయించి ఒక కారపు పిండివంట ఒక తీపి పిండివంటచేసి పుల్లపెరుగు పోగిచి తియ్య పెరుగుతోడబెట్టి అటుకమీది ఊరగాయలు గూడతీసి విస్తరినిండా వడ్డిస్తుంది. అయితే అత్తవారింట్లో భోజనంచేసే పద్ధతులు వివాహానికి పూర్వంనుంచి ఎన్నాళ్లుగా ఊహించి మనసులో పెట్టుకొని ఉంటాడోకాని, కొత్తగా పెండ్లియైన ఆ పెండ్లి కొమారుని మొగమాటానికి అంతు ఉండదు. ఇంటి

వద్ద వెల్లుల్లి కారం తినే బాపతైనా సరే, అత్తవారింట భోజనం అనగానే వడ్డించిన వస్తువులు మరల వడ్డించుకోడు. విస్తరిలో మొదట వడ్డించినవైనా కొన్ని రుచిచూచీ కొన్ని చూడకా, కొన్ని కలుపుకొని కొన్ని కలుపుకోక, కొన్నిటిపి తినీ, కొన్ని తినకా కాస్తో కూస్తో అట్లా ఇట్లా నంజి అటూ ఇటూ తోసి పదినిముషాల్లో భోజనం ముగించి అత్తగారు బిక్కమొగం వేసి చూస్తూ ఉండగా లేచిపోతాడు. అదీ ఒక నాజూకుగానే భావించి అత్తగారు మనస్సమాధానం చేసుకుంటుంది. మా ఊళ్లో ఒక తాతగారు ఉండేవారు, వాళ్ల ఇంటికి ఒకనాడు మనుమరాలి పెనిమిటిని మనుగుడుపులకు తీసుకొని వచ్చారుట. అతనికి అయిదారు బజ్జీలు రెండు జాంఘీరులు ఫలహారం పెట్టారుట. అతను ఒక్క జాంఘీరులో కొంచెము మూడు బజ్జీలు మాత్రమే తిని అరకప్పు కాఫీ మాత్రం త్రాగి లేచిపోయినాడట. ఆ ముసలాయనకా షోకు చూస్తే ఒళ్లు మండి ఏమబ్బాయి ఇవేమన్నా మా కాలంలోలాగా అరిశెలా జంతికలా చేగోడీలా మినపసున్ని ఉండలా ఇరవైయేళ్ల పడుచు కుర్రవాడివి ఆరు బజ్జీలు రెండు జిలేబీ చుట్టలూ తినలేవుటోయి అన్నాడుట. ఆ అబ్బాయి ముసి ముసి నవ్వులు నవ్వుతూ నాకు సయించవండీ తాతగారూ అన్నాడట.

ఇక అధికార్లకు పెట్టే భోజనాలు వారి మొగమోటాలూ మరోవిధంగా ఉంటాయి. అది సమృద్ధిగా వస్తువులు దొరకని పల్లెటూరైతే ఆ ఇల్లాలి ఇబ్బందులు అనంతము. ఆ అధికారి తానూ తన గుమాస్తాలు తన బంట్రోతులూ భోజనాలు చేయడమే కాకుండా తనతో పనిఉండివచ్చిన ఇతర పెద్దలనుగూడా పొరుగింట చూపరా నా పెద్దచెయ్యి అన్నట్టు భోజనానికి లేవమంటాడు. అందరూ షడ్రసోపేతంగా భోజనం పెట్టవలసినవాళ్ళే. కాదంటానికి గృహయజమానికి మొగమోటం. చేసిపెట్టలేక ఇల్లాలికి కష్టం ఇదే విషమపరిస్థితి. తీగలాగితే డొంకంతా కదులుతుంది. ఇప్పటికే ప్రసంగం ప్రస్తుతానికి మించింది. సెలవు.

(బెజవాడ ఆలిండియా రేడియో వారి సౌజన్యంతో)



# జానకి

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

(గతసంచిక తరువాయి)

రామరావుకు జరగవలసిన కర్మకాండ అంతా అయి పోయింది. రామరావు అన్నలు, జానకి అన్న అందరు వచ్చారు. వాగు వెళ్లిపోయేముందు జానకి భవిష్యతు ఏమిచేయాలని ఆలోచన వచ్చింది. జానకి అన్నగారు వదినగారు, జానకిని తమవద్ద వచ్చి వుండమని పిలవలేదు. రామారావు, పెద్దఅన్నయ్యగారు మాత్రము జానకిని పిల్లవానిని తన వద్దవచ్చి వుండమన్నాడు. బిడ్డకు చదువు సంగతి తనే చూచుకుంటానని కూడ అన్నాడు. కాని జానకి అభిమానవతి పట్టుదలగలది. యీ సంగతి అందరికి తెలుసు. ఆవిడ పట్టినపట్టు చెల్లవలసిందే. జానకి "నేను ఎవరిదగ్గఱ వుండదలచుకోలేదు. వారు లేనంతమాత్రన న్నాబిడ్డను నేను పోషించుకొనలేక పోలేను. ఎలాగో, కష్టపడి నా బిడ్డను చదివించుకొనగలను మీకెవ్వరికీ ఆ శ్రమ అక్కరలేద"ని నిక్కచ్చిగా చెప్పింది. ముందు వెనుకకూడ ఆలోచించుకోలేదు.

కొన్ని రోజులు గడచిన తర్వాత జానకి తన భర్త ఆఫీసు మేనేజరును, ఆఫీసులో కలుసుకుని "పూర్వము మీరు అవుసరముంటే నీకు మా ఆఫీసులో పని యిప్పించగలనని అనివున్నారు. దయచేసి మీ ఆఫీసులో నా కొక వుద్యోగము యిప్పించండి నా భర్త పని అయినా సరే, నేనుచేస్తాను" అంది. ఇంతవరకెప్పుడు ఆ ఆఫీసులో స్త్రీలు వుద్యోగాలకు నియమింపబడలేదు. ఇప్పుడు అటువంటి నియామకము చేయటానికి కొంత తటాపటాయించేడు మేనేజరు. కాని కొన్నిరోజులు ఆలోచించిన మీదట జానకిని ఆఫీసులో పనికి నియమించాడు. జానకి సహజమైన తెలివితేటలవల్లనైతేనేమి, జానకి స్త్రీ అయినందువల్లనైతేనేమి ఆఫీసులో బాగా పైకి వచ్చేస్తోంది.

జానకి తన యిల్లు అమ్మివేసింది. ఇప్పుడు ఒక చిన్నయింట్లో ఒకభాగములో అద్దెకు వుంటోంది. తన జీతముతోటి తనకొడుకు మోహనును చదివిస్తోంది. అలా సంవత్సరాలు దొర్లుక పోయాయి. ఇప్పుడు మోహనుని మీద తన ప్రేమనంతా కేంద్రీకరించింది. తన భవిష్యత్తునంతా వాడిమీద పెట్టి వుంచింది. మోహను ఇప్పుడు మెడికలు కాలేజిలో చదువుతున్నాడు. ఎవరి సహాయము కోరకుండానే జానకి నెట్టుకువస్తోంది తన సంసారాన్ని. మోహను స్కాలరుషిప్పుమీద చదువుతున్నాడు.

ఒక రోజు జానకి మోహనులు బజారుకువెళ్లి ఏవో కొనుక్కుంటున్నారు. అదే-షాపులో జానకి వదిన మాలతికూడ కొనుక్కొంటోంది. మాలతిని చూడగానే జానకి ముఖము తిప్పేసింది. మాలతి అంటేనే జానకికి పనికిరాదు. మాలతి మోహనుతో "ఎప్పుడైనా నీవుకాని మీ అమ్మకాని మాయింటికి రాకూడదూ! మేమంటేనే పనికిరాకుండా వచ్చిందేమి? రేపు మాన శిని పుట్టినరోజు, రేపు తప్పకుండారా మోహను" అని పిలిచి, వెళ్లింది.

జానకి యింటికివెళ్లిన తర్వాత మోహనుతో "మోహన్ నీవు రేపు మామయ్యగారింటికి వెళ్లవద్దు. వారు మనకేమి సహాయము చేసి మనసంగతి కనుక్కుంటున్నారు. నిన్నుపిలచి చిన్నతనముగ చూడటానికే మీ అత్తయ్య పిలిచిందని తెలుసుకో" "ఫో అమ్మా, నీవు అన్నిటికి యింతే, నీకు మరీ అయినవాండ్లంటేనే పనికి రాకుండా వచ్చింది. మనము అందరితో మంచిగావుంటేకదా! మన అవసరానికి, పనికి వస్తుంది. నీకు ఎంతకాలము ఓపికవుంటుంది." "అదంతా నాకు అక్కరలేదు. అయిన వాళ్లతో సంబంధములు పనికిరాదు. నీకెందుకు నేను కొన్ని రోజులు నిన్ను పోషిస్తే. తర్వాత నీవే నన్ను పోషించగలవు. మనయిద్దరము చక్కగ వుండగలము కదా! మన కష్టములన్నీ ఫలించబోయే సమయానికి యితరుల జోక్యము ఎందుకు?" "నీవు నన్ను చిన్నవాడిలా చూస్తున్నావు నాకు నా యీడున్నవారితో

తిరగాలని సరదాగా వుండదా? ప్రతిదానికి నీ సలహా ప్రకారము చేస్తుంటే తోటివాళ్లందరు నన్ను "నాయనమ్మ"నని ఎగతాళికూడ చేస్తున్నారు." "నాకు కోపము తెప్పించకు! నాకు యిష్టములేదు-నీవు వెళ్లటానికి వీలులేదు" అని కోపముగా వెళ్లి పోయింది జానకి. "సరే, అలాగేలే" అంటూ, మోహను కోపముగా వెళ్లిపోయేడు. ఇద్దరు భోజనము చేసి యిల్లు తాళము వేసుకొని, ఎవరి పనులకు వాళ్లు వెళ్లి పోయేరు వెళ్లే ముందు మోహను మాత్రము "అమ్మా నేను కాలేజీనుంచి యీ రోజు కొంచెము ప్రొద్దుపోయివస్తాను" అన్నాడు.

మోహనుడు కాలేజీనుంచి సరాసరి మామయ్య గారింటికి వెళ్లేడు. నళిని "ఏం! బావా వచ్చావా? అత్తయ్య నిన్ను రానిచ్చినదా?" అంది. శంకర్ "బావా పైకిరా నీ డ్రస్సు తీసి నావి కొత్తవి మంచివి వున్నాయి వేసుకుందువుగాని రావోయి" అని మోహనుని పైకి తీసికెళ్లి తన మంచి డ్రస్, యిచ్చాడు. మోహను డ్రసు వేసుకుని క్రిందకు వచ్చాడు. టీపార్టీ బాగా జరుగుతోంది. నళిని, స్నేహితురాలు సరోజ కూడా వచ్చింది. నళినితో చదువుతోంది. మోహనుని వాళ్ల మామయ్య అత్తయ్య ఎంతో ఆప్యాయముగా తన సంగతి కనుక్కుంటున్నారు. మోహనునికి వేరే ప్రపంచములో వున్నట్లుగావుంది. తర్వాత చాలసేపు అంతా టెన్నిసు ఆడారు.

రాత్రికొంచెము ప్రొద్దు పోయినాక మోహను యింటికి వెళ్లేడు. తల్లి భోజనానికి పిలిస్తే ఆకలిలేదని భోజనము చేయలేదు. "మోహన్ మామయ్యగారింటికి వెళ్లవద్దన్నా వెళ్లి వచ్చావుకదూ?" "అవును వెళ్లేను. మా మామయ్య అత్తయ్య పిల్లలు అందరు ఎంతో సరదాగావున్నారు. నన్ను ఎంతో యిదిగా చూచేరు. నీకెందుకు వాళ్లు అంటే పనికిరాదో అర్థముకాదు!" 'చాల్లే నోరుమూసుకో నామాట కాదని వెళ్లినది కాక యింకా ఎదురుకూడా మాట్లాడతావా?" అని అక్కడినుంచి లేచి పోయింది జానకి రోషముతో.

మోహను అప్పుడప్పుడు మామయ్యగారింటికి వెళ్లి వస్తున్నాడు. నళిని స్నేహితురాలు సరోజకు తనకు ప్రేమకలిసింది. మామయ్యకూడ తను యిష్టపడితే సరోజ తండ్రితో కలిసి పెళ్లికి ఏర్పాటు చేస్తానని చెప్పేడు.

ఆ రోజు మోహను డిగ్రీతీసుకొనే రోజు జానకి ఆఫీసు సెలవు పెట్టింది. జానకిలో చాలమార్పు వచ్చింది. వయస్సు ఎక్కువలేకపోయినా కష్టజీవితముతో ఒంట్లో నలత ఏర్పడింది. ముసలి ఛాయలు కనిపిస్తున్నాయి. తనకున్న మంచి చీరకట్టుకుని కాన్వొకేషనుకు బయలుదేరింది. చాలా మందిజనం వచ్చారు. ఎత్తైన ప్లాటుఫారము మీదనుంచి, గవర్నరుగారు ఒక్కొక్క విద్యార్థిని పిలిచి డిగ్రీ సర్టిఫికేటు యిస్తున్నాడు. మోహను వచ్చాడు. క్లాసులోకెల్లా ప్రప్రథముడుగా వుత్తీర్ణుడు అయినందుకు, అభినందిస్తూ డిగ్రీ కాగితము యిచ్చారు. జానకికి సంతోషముతో కళ్లనీళ్లు కారిపోయినవి. చుట్టూ ఎవరు వున్నారో కూడ కనుపించలేదు. కాన్వొకేషను అయిపోయింది. అందరు బయటికి వచ్చేసేరు. మోహను ఎప్పుడో బయటికివచ్చి, వాళ్ల మామయ్య అత్తయ్య, నళిని; శంకరు, సరోజ తండ్రి పెద్దనాన్నగారు వీళ్లందరితో కబుర్లు చెబుతున్నాడు. వీళ్లందరిని ఒక్క మాటుచూసేప్పటికి జానికికి తలతిరిగినంతపని అయినది. వీళ్లందరికి తన సంతోషములో పాల్గొనటానికి హక్కు లేదనిపించింది. వీళ్లను చూడగానే "మీరందరు యిక్కడికి ఎందుకు వచ్చారు? మిమ్మలను ఎవరు పిలిచారు" అని కటువుగా అడిగింది. "మోహను ఏమిటమ్మా ఆ మతిలేనికబుర్లు; నీకు రాను రాను బుర్రే పనిచేస్తున్నట్లులేదు నలుగురిలోను, అలాగేనా నువ్వు మాట్లాడవలసింది, నేనే పిలిచాను వాళ్లను రమ్మనమని. నీలాగ వాళ్లతో సంబంధము నేను విడగొట్టుకోలేను" అని తల్లినికోపపడ్డాడు. నలుగురిముందర తన్ను కొడుకు ఘష్ణణగా మాట్లాడినందుకు రోషము వచ్చి, వాళ్లందరు విందుకు పిలిచినాగాలేదు. మోహనును చేయిపట్టి లాగినా, అతను చేయి విదల్చి

కుని వారితో వెళ్ళిపోయేడు. జానకి అక్కడే, కొంచెముసేపు నిలబడిపోయి తర్వాత యింటికి వెళ్ళిపోయింది.

జానకి, లోపలగదిలో పడుకుని చదువుకుంటోంది. తలుపుకొట్టిన శబ్దమువిని వచ్చి తెరిచింది జానకి. ఎవరో అపరిచితుడు. ఒకాయిన నిలుచున్నాడు. "రండి లోపల యీ కుర్చీలో కూర్చోండి" అంది జానకి "నేను, పట్నములో మంచి పలుకుబడిగల వర్తకుడిని. నా పేరు రామదాసు మీ అన్నయ్యగారిని మీ బావగారిని అందరిని ఎరుగుదును" నాకు సరోజ అనే ఒక అమ్మాయివుంది. కాలేజీలో చదువుతోంది. నాకు భార్యలేదు. ఈ ఒక్క కూతురే, నాకు. మంచిసంబంధము ఒకటి చూసి, ఒక అయ్య చేతిలో పెట్టి పోదామనివుంది. మీ అన్నయ్యగారింట్లో మీ అబ్బాయి మోహనుని చూసాను. మీ అబ్బాయికి, మా అమ్మాయిని యివ్వవలెనని నాఉద్దేశ్యము. అబ్బాయికి ప్రాక్టీసు, పెట్టడానికి సహాయము చేస్తాను. మీ అబ్బాయిని చూచినప్పటినుంచి వాడే మా అల్లుడు కావడానికి తగినవాడని అనుకున్నాను. మీరు ఒక్కమాటు అబ్బాయిని తీసికుని, మా అమ్మాయిని చూడటానికి రావాలి, నచ్చితే ముహూర్తాలు పెట్టుకోవచ్చు" అంటూ తను వచ్చిన పనిని గూర్చివిస్తరముగ చెప్పాడు. జానకి "మా అబ్బాయికి యిప్పట్లో పెళ్లిచేసే వుద్దేశ్యములేదండి నాకు. వాడి ప్రాక్టీసుకు, మీ సహాయము అక్కరలేదు. ఎలాగో ఒకలాగు కష్టపడి వాడి చేత ప్రాక్టీసు పెట్టిస్తాను. వాడు సంపాదిస్తూంటే ఇద్దరముకాలక్షేపమూ చేసుకుంటాము. ఇప్పుడు చిన్నవాడు; వాడికి పెళ్లికి తొందరలేదు. మీరు మామీద ఆశ పెట్టుకోకండి. మీ అమ్మాయికి వేరే సంబంధము చూచుకోండి" నిష్కర్షగా చెప్పి అతనిని పంపివేసింది.

ఆ సాయంకాలము మోహను యింటికివచ్చాడు. భోజనాలప్పుడు జానకి, కొడుకుతో "మధ్యాహ్నము రామదాసుగారు ఎవరో వచ్చారు. నీకు పిల్లనిస్తానంటూ" అంది "ఏమి చెప్పి పంపావు అమ్మా" అన్నాడు మోహను "ఇప్పట్లో నీకు పెళ్ళి చేసే వుద్దేశ్యము నాకులేదని, వారిని వేరే సంబంధము చూసుకోమని చెప్పాను" "ఎందుకు అలా చెప్పావు" "ఎందుకేమిటి ? నీకింకా పెళ్ళియీడురాలేదు. నీవు ప్రాక్టీసు పెట్టి స్థిమితపడిన తర్వాత నేనే నీకు పిల్లను చూసి, పెళ్ళిచేస్తాను అయినా యీ కాలపు పిల్లలు వంటలు అవి చేసి నిన్ను సుఖపెడతారా ఏమిటి? " "నన్ను యింకా నీ కొంగు పట్టుకతిరిగే కుర్రాడనే, నీవు అనుకుంటున్నట్లు వున్నావు. నా సంగతి నా మంచి చెడ్డలు, నా బ్రతుకు తెరువులు నేను చూచుకోగలను. నాకు రామదాసుగారి అమ్మాయి నచ్చింది నేను ఆ అమ్మాయిని పెళ్లి చేసికుంటాను. నీవు యిష్టపడితే సంతోషముగ చేసికుంటాను. నీవు పెద్దదానివై పోతున్నావు నీకు మనిషి సాయము కావాలిగదా బాగా డబ్బున్నవాడు మనకు సాయముచేయగలవాడు నా పెళ్ళికి అవుసరములేదని ఎందుకు అనుకోవాలి నీవు ? "

"ఇన్నాళ్ళు చెమట ఓడ్చి అష్టకష్టాలపడి నిన్ను చదవించి పెద్ద చేసేను తీరా ఫలితము అనుభవించవలసిన సమయానికి యింకొకరు దేనికి. నేను నిన్ను కనిపెట్టుకొని నీ సంగతి కనుక్కుంటాను. నీవు డబ్బు సంపాదించితే, సుఖపడవచ్చు అంది" జానకి. తల్లి మూర్ఖతకు మోహనుకు నవ్వువచ్చింది. "అమ్మా, నీకు పెద్ద తనములో కొడుకని, కోడలని ముచ్చట అక్కరలేదా! నీవు కష్టపడి నన్ను పైకి తెచ్చావు కనుక నీ సంతోషములో భాగస్వాములువుండకూడదనే వుద్దేశ్యము నీమాటల్లో తెలుస్తోంది. నా పెళ్ళి ముచ్చట నీకు

అక్కరలేదా ! ” అన్నాడు. “ఏమో! ఆయనను చూస్తే నాకు నచ్చలేదు” అని తన అయిష్టతను కప్పి పుచ్చింది. జానకి.

మోహను వాళ్ల మామయ్యను కలుసుకొని తన తల్లికి యిష్టములేకపోయినా సరోజను పెళ్ళి చేసుకుంటానని చెప్పినాడు. వారంరోజులలో జానకికి మోహను పెళ్లిశుభలేఖ వచ్చింది. జానకికి కోపము దుఃఖముకూడా వచ్చింది. ఇన్నాళ్లు పెంచి పెద్ద చేసిన మోహను తన మాటకాదని పెళ్లి చేసికుంటున్నాడు. జానకి పెళ్ళికి వెళ్ళలేదు. పసుపుబట్టలతో సరోజ మోహనులు యింటికి తనకు నమస్కరించటానికి వచ్చినా వారిని ఆశీర్వదించటానికి కూడా మనస్కరించలేదు జానకికి.

ఇప్పుడు మోహనుడు దగ్గరవున్న పట్నములో ప్రాక్టీసు పెట్టాడు. అక్కడి ఆసుపత్రిలో కూడ పని చేస్తున్నాడు. మాట ప్రకారము రామదాసు గారు మోహను ప్రాక్టీసు పెట్టుకోడానికి డబ్బు సాయము చేసాడు. సరోజ, మోహనులు కులాసాగావుంటున్నారు. మోహను ఎన్నోమారులు తల్లిని వుద్యోగముమాని, తనదగ్గర వచ్చివుండమని బ్రతిమాలాడు. తనను పువ్వులోపెట్టి పూజిస్తానన్నాడు కాని జానకి కొడుకు దగ్గరకు వెళ్లటానికి యిష్టపడలేదు.

జానకి యిప్పుడు ఒంటరిదైనది. ఎవరికోసము యీ వుద్యోగము చేస్తోందో అర్థముకాలేదు. ఈ ఒంటరి జీవితముమీద విరక్తి పుట్టినది. మమతలు వదలి పారమార్థికజీవితములోకి వెళ్లి పోదామనుకుంది. అదే యింక తనకు శరణ్యమనితోచింది. కాశీకి వెళ్లి అక్కడ జీవిత శేషము గడిపేయాలని నిశ్చయించుకుంది. వెంటనే తన వుద్యోగమునకు రాజీనామా యిచ్చి ఫలానా బండిలో బయలుదేరి వెళ్లిపోతున్నానని మోహనుకు వుత్తరము వ్రాసింది.

స్టేషనుకు కొడుకు వచ్చాడు “యిన్ని రోజులు నీవు నాకోసము కష్టపడి యిప్పుడు సుఖపడే కాలానికి నీకీవైరాగ్యము ఎందుకమ్మా! నామాట విను నాతో యింటికి రా! ” “రాలేను నాయనా! నా మనస్సు భగవదర్పితము చేసాను. జీవితములో కష్టసుఖాలు అనుభవించాను. ఇక చాలు ఈ జీవితశేషమైనా ముక్తి మార్గములో గడుపుతాను” అంది జానకి.

“అమ్మా! నీకు తెలియదు. ఈ వయస్సులో నీవు కష్టాలు పడలేవు. అందులో కాశీలోని చలి నీవు భరించలేవు! సుఖముగా నా దగ్గరవుండు. నీ చేతిమీదుగానే మనయింటిలో పెత్తనము నీవు చేయాలని నా కెంతో యిదిగావుంది.” అని బ్రతిమాలాడు మోహన్. కాని జానకి మనస్సు కరుగలేదు. చివరికి మోహను విసిగి కొంతడబ్బు మాత్రము వాడుకోమని యిచ్చి తల్లిని బండి ఎక్కించి యింటికి విచారముగా వెళ్లిపోయేడు.

జానకి కాశీ చేరింది. అక్కడ తెలిసినవాళ్ల బసకు వెళ్లింది. కొన్ని రోజులు గంగాస్నానాలు చేసేప్పటికి చలి జ్వరము ప్రారంభించాయి. ఒక రోజు చాల జబ్బు చేసింది జానకికి. తోటిబసవారు ఆశకూడ వదిలేసినారు. కాని నెమ్మదిగా, నిమ్మళించింది. చాల బలహీనమైపోయింది. మనస్సు కొడుకు మీదకు వెళ్ళింది. ఇక ఒకగడియ యింకా కాశీలో వుండలేకపోయింది. కొడుక్కు తనుబయలుదేరి వస్తున్నట్లు వుత్తరం వ్రాసింది. బయలుదేర బోతుంటే తోటివారు “ఇంత బలహీనముగా వున్నావు కొంచెము బలముచేకూరిన తర్వాత వెళ్ళవచ్చు ఇంతలో మీ అబ్బాయి దగ్గఱనుంచి వుత్తరముకూడ రావచ్చు” అన్నారు.

కాని జానకి పట్టుబట్టి మరునాడే బయలుదేరింది. రెండు రోజుల నిండు ప్రయాణం తర్వాత, జానకి తన వూరి స్టేషనులో దిగింది. స్టేషనంతా కలియచూచింది తన మోహాను కోసము. మోహానుకు తను వ్రాసిన జాబు, తెరవకుండా అతని టేబిల్ మీదవుంది. మోహాను కేసులో ప్రక్కవూరికి వెళ్ళేడు. కోడలు పుట్టింటికి వెళ్ళింది. స్టేషనులో చలి జ్వరము తీవ్రముగా వచ్చింది జానకికి. ఒక తెరలా వచ్చి పడి పోయింది. అంతా గుమికూడారు. పోలీసువారు, అందరినీ తప్పుకోమన్నారు. "ఎవరో యీ ముసలిది. దిక్కులేనిదిగాబోలు. ఇంత వయసువచ్చి యింట్లోపడి వుండక తగుదునమ్మా నంటూ ఒంటరి ప్రయాణాలు చేస్తారు మా ప్రాణానికి వురిగా ఈ ముసలివారు ఎవరి ముసలిదో" అంటూ, ఆస్పెటల్ వాన్‌లో, ఎక్కించి, హాస్పిటల్లో చేర్చారు. రెండు రోజులు వరకుకూడ స్పృహరాలేదు. మూడో రోజు కొంచెము స్పృహవచ్చిందికాని ఎంతసేపోవుండలేదు ఆస్పృహ.

జానకికి తన భర్త తనకొడుకు అందరు కనిపించారు తెరలు తెరలుగా తన యింట్లో కిటికీలోంచి బయటికి చూస్తున్నది వెలుతురునూర్యుడు. కళ్ళుపొడుస్తున్నాడు ఒక్కసారి. ఇంతలోనే గబుక్కున చీకటి అయింది. పెదమలు ఒక్కసారి కదిలాయి. జానకిశాశ్వతముగా కళ్ళుమూసింది.

ఎవరో దిక్కు తెలియని అనాధ ప్రేత, ఇప్పుడు జానకి. శవాలంటే చాల భయము జానకికి. ఇప్పుడు చల్లటి ఆ రాళ్ళమీద దిక్కులేకుండా పడుకుని వుంది.



## ఎలిజబెతురాణి కిరీటం

చారిత్రాత్మకంగా షుమారు వెయ్యి సంవత్సరములనుండి ప్రఖ్యాతిగాంచినది. ఇందులో అమూల్యమైనమణులుపొదగ పడియున్నవి. పట్టాభిషేక మహోత్సవ సందర్భమున కొన్ని నిమిషములు మాత్రమే ధరించబడుతుంది.

# కనీసపు కోరికలు

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షిగారు

వచ్చి పదిరోజులైనా ఆనాటివరకు నాకు ఆ ఇంట్లో ఎవరితోనూ పరిచయం కాలేదు. మావారు వుదయము పదిగంటలకు భోజనముచేసి ఆఫీసుకు వెళితే సాయంకాలముదాకా తిరిగివచ్చేవారుకారు. ఇంట్లో పనివున్నంతసేపు పనిచేసుకొని తీరుబడిగా వున్నప్పుడు ఏదో పుస్తకము చదువుకొని కాలక్షేపం చేసేదాన్ని. ఆ ఇంట్లో నాలుగయిదు కుటుంబాలవాళ్ళు కాపురమున్నారు. సాయంకాలముకాగానే వారంతా వంటలు చేసుకొని ఎక్కడెక్కడో తిరిగి రాత్రికి ఇంటికి చేరేవారు. వాళ్లు ఎక్కడికి వెళుతున్నారో నేనడగలేదు. తమతో రమ్మని వాళ్లు నన్ను పిలవనూలేదు. అసలు వాళ్లు నన్ను పలకరిస్తేగా! ఇంత ముభావంగా ఇలా వుంటారెందుచేతని మావారి నడిగితే "ఇవన్నీ బస్తీ అలవాట్లు; నువ్వూ నేర్చుకో" అన్నారు. ఆ రోజు మామూలుగా వంట పూర్తిచేసుకొని తల దువ్వుకొంటున్నాను. మా పక్క వాటాలో వున్న సుందరమ్మగారు (అలాగని అందరూ పిలవగా విన్నాను.) వచ్చారు. "ఏమండీ మాణిక్యమ్మగారు ఈ రోజున మహిళా మండలిలో మీటింగున్నాది. మీరు కూడా రాకూడదా? అలా వూరకనే కూర్చోకపోతే" అన్నారు. "సాయంకాలము మావారొచ్చేసరికి నేనింటిదగ్గర వుండకపోతె చిరాకుపడుతారు. నేను రానండీ" అన్నాను. మేము ఇలాగ మాట్లాడుకొంటుండగానే మావారి ఆఫీసు బంట్రోతువచ్చాడు. "అమ్మా! అయ్యగారు వచ్చేసరికి ఆలస్యమౌతుందిట. సినీమాకెళతారుట. మీతో చెప్పమన్నారు" అన్నాడు. "ఇంక ఎలాగా మీవారు పదిగంటలయితేకాని రారు. ఆ వేళకి మనము వచ్చేద్దామురండి" అన్నారు సుందరమ్మగారు. ఆవిడ అలా బలవంతపెడుతూంటే కాదనలేక బయలుదేరేను.

ఓ మూడు రిక్షాలలో ఇంట్లోవున్న ఆడంగులమంతా బయలుదేరాము. చాల దూరముపోయి ఒక పెద్దభవనము ముందర రిక్షాలు ఆగేయి. అప్పటి కప్పుడే చీకటి పడుతూ వుండడముచే దీపాలు వెలిగించేరు. ఆ వెలుగులో ఒక ఇంద్రభవనంలాగున్నాది ఆ మందిరం. లోపలికి వెళ్లేసరికి అప్పటికే హాలంతా స్త్రీలతో కిటకిటలాడుతున్నాది. అబ్బా ఎంతమంది. వరదోత్సవములోనూ

ఇంతమంది ఆడవాళ్లను నేను చూడలేదు. అందరికీ కళ్లకిజోళ్లు, కాళ్ళకిజోళ్ళు, రిష్టు వాచీలు ఒకటేమిటి నవీన నాగరికత అంతా వుట్టిపడుతూవున్నారు. దూరంగా స్టేజి మీద ఎవరో మాట్లాడుతున్నారు. వాళ్లు మాట్లాడేది స్పష్టమైన తెలుగూకాదు, ఇంగ్లీషూకాదు. రెండూ కలగలుపు. ఒకరిమీద ఇంకొకరు కలియబడి కొట్టుకుంటారేమో అన్నంత వుద్రిక్తంగా వాదించుకొంటున్నారు. వారు దేనికలా దెబ్బలాడుకుంటున్నారని అడిగేను నా పక్కనేవున్న సుందరమ్మగారిని. "దెబ్బలాటకాదు. స్త్రీలపై పురుషులు చేస్తున్న దౌర్జన్యాన్ని నిరసిస్తున్నారు. ఈ నగరములోగల మహిళలందరూ రేపటినుండి స్ట్రయికు చేస్తున్నారు. దాన్ని ఎలా నడపవమనేదే నేటిమీటింగు వుద్దేశము. ఇందులో ఎవరి అభిప్రాయాలు వారు చెప్పవచ్చు. మీకేమేనా తోస్తే స్టేజిమీదకివెళ్లి చెప్పండి" అన్నారు. అసలు ఈ స్ట్రయికుఅనే మాటకు సరిగా అర్ధమేనా తెలియని నేను చెప్పేదేమిటి అనుకున్నాను. కొంతసేపు తర్జన భర్జనలయిన తరువాత అధ్యక్షురాలు వుపన్యసించేరు. "ఏమిటో సరిగా అర్థంకాకపోయినా మొగవాళ్లు ఆడవాళ్లని బానిసలుగా చూస్తున్నారనీ, వారికి వ్యక్తి స్వాతంత్రము లేకుండా చేసేరనీ, వాళ్లకి (స్త్రీలకి) తగిన ఆర్థికస్థోమత లేకపోవుటే దానికి కారణమనీ, స్త్రీ పురుషునితో సమంగా ఆర్జించగలిగిననాడు పురుషుడు స్త్రీని ఇంత చులకనగా చూడలేడనీ, అందుకు స్త్రీ విద్య ఎంతేనా అవుసరమనీ, ప్రతి గృహిణీ దినములో కొంత కాలము విద్యకొరకు వుపయోగించుకోడానికి వీలుగా వుండాలనీ, ఇంటిలో పనులు చేయుటకు కాలనిర్ణయము వుండాలనీ, అటులకాక రాత్రింబగళ్లు ఎద్దులా చాకిరీ చేయుట వలన ఆరోగ్యము పాడయి స్త్రీ ఏపని యందు ఆసక్తి చూపలేక పోవుచున్నదనీ, ప్రతివారికున్నట్లుగానే స్త్రీకి వారమునకు ఒక రోజు శెలవూ, దినములో కొన్ని గంటలు విశ్రాంతి అవసరమనీ, అందుకొరకై రేపటినుండి ఈ నగరమునగల మహిళలందరూ స్ట్రయికు చెయ్యాలనీ, మొగవారు ఎంత కోపగించినా, కొట్టినా, తిట్టినా, బతిమాలినా ఈ కోర్కెలు నెరవేర్చెదమని మాట ఇచ్చేవరకు ఇళ్లలో ఏపనీ ముట్టరాదని తీర్మానించడమైనదనీ, ఈ తీర్మానము పూర్తి మెజారిటీతో నెగ్గిందనీ చెప్పేరు. ఇంటి దగ్గర వంటలు చెయ్యక పోవుటచే తప్పనిసరిగా నిరాహార దీక్ష పూనవలసి వస్తుందనీ, అందుకు అందరూ సిద్ధముగా వుండాలనీ" చెప్పేరు. మహిళామండలి జిందాబాద్ అనీ, స్త్రీల కనీసపు కోర్కెలు తీరాలి" అనీ నినాదాలు చేసుకొంటూ అందరూ గుంపుగా బయలుదేరేరు. అంత దూరమునడచి ఇల్లు చేరుకొనేసరికి నాకు కాళ్లు లాక్కొచ్చేయి.

అలానే పక్కమీద కూలబడ్డాను. మరి కొంతసేపటికి మావారువచ్చి ఆకలిగా లేదనిచెప్పి భోజనముచేయకే నిద్ర పోయారు. నేనూ మరి లేవలేదు.

౨

మరునాడు పుదయాన్నే లేచి అలవాటు ప్రకారం కాఫీ పెట్టాలని నిప్పు చేస్తున్నాను. సుందరమ్మగారు గబగబావచ్చి నాచేతిలోని విసనకఱ్ఱా, అగ్గిపెట్టీ అవతల పారవేసి, కుంపటిలో చెంబుడు నీళ్లుపోసి "ఏమండీ మాణిక్యమ్మగారు! మహిళల స్ట్రయికు సంగతి మరచిపోయారా. నయం నేను చూశాను కాబట్టి సరిపోయింది లేకపోతే ఎంత పనైపోను" అన్నారు. "సుందరమ్మగారూ! ఈ స్ట్రయికులు అవీ మీలాంటి చదువుకున్న వారికీకాని మాకేమిటండీ. ఇంట్లో వంటా, పనీ చెయ్యకపోతే ఎలా గడుస్తుంది" అన్నాను, ఈ మాటికి నన్ను వదలివేయండని బ్రతిమాలుకుంటూ. అబ్బే, ఆవిడ వింటేనా! ససేమిరా వల్లకాదంది. ప్రతి ఒక్కరూ ఇలా వెనుకాడితే స్ట్రయికు నెగ్గేదెలా! మహిళల కోరిక లెలాతీరుతాయి అన్నారు. అప్పటికే మావాదన విని నిద్రమంచంమీదనుండి లేచివచ్చిన మావారు "అలాగేనండీ, మీస్ట్రయికు పూర్తయేదాకా మా ఆవిడ వంటా, పనీ చేయకుండా నేచూస్తానులెండి" అన్నారు. "నిజంగా మీరు అలాచేస్తే మామహిళలకు చాల తోడ్పడిన వారు అవుతారు" అన్నారు సుందరమ్మగారు సంతృప్తిగా. సరే ఇక ఎలాగా తప్పదని చేస్తున్నపనిమాని కూర్చున్నాను. అంతటితో ఆవిడ వదులుతేనా, ఇంట్లోగల ఆడవారి నందరినీ వెంటబెట్టుకొని ఇంటింటికి బయలుదేరింది. గుడికి పోతూన్న మేకపిల్లలా భయపడుతూనే వారి వెంట వెళ్లాను. ఒక ఇంటికి వెళ్ళేసరికి ఆ ఇంటి అత్తా కోడలూ దెబ్బలాడుకుంటున్నారు. సుందరమ్మను చూడగానే ఆ కోడలు "చూడండీ సుందరమ్మగారూ! మహిళల స్ట్రయికు సంగతి చెప్తే నమ్మక నేను పని ఎగ్గొట్టడానికి చూస్తున్నానంటున్నారు మా అత్తగారు" అన్నాది. "ఇదేమి సోద్యమమ్మా మానాడు ఇలాటి వెరుగుదుమా? రాత్రనక, పగలనక పని పాట్లు చేసుకొనేవారము" అన్నాది అత్తగారు. "మామ్మగారూ! మీకెందుకీ పనుల గొడవలు, హాయిగ కృష్ణా, రామా అని ఓమూల కూర్చోక? అవి అన్నీ మీకోడలు చూసుకొంటుంది. రామమ్మా అమ్మాజీ! అలా వెళ్లి వద్దాం. మామ్మగారూ మీ కోడలొస్తుంది మీరు తొందరపడి వంట చెయ్యకండి" అన్నారు సుందరమ్మగారు.

త్రోవలో కన్పించిన ఒక ముసలితాత "ఏమమ్మా సుందరమ్మా, మా ఇళ్లలో ఇలా ఆరనిచిచ్చుపెడితే నీ కోరికేదేమిటి. ఇంట్లో ఆడాళ్లు వంటలుచేయకపోతె ఎలాగ?

పిల్లాపీచు కలవాళ్లముగాని నీలావిడివాళ్లము కామే" అన్నాడు. "ఎలాగ తాతగారూ రెండురోజులోర్చుకోవాలి. మేము వంటలు చెయ్యడము, మా నషము మీ పురుషుల చేతిలోనే యున్నది. మాకనీసపు కోర్కెలు తీరుస్తే వెంటనే ఇంటిపనులలో జాయిను అవుతాము" అన్నాది అమ్మాజీ. ఇలా రెండు వీధులు తిరిగే సరికి రెండుఝాములయినది. అందరికీ కడుపులో నకనకలాడుతున్నా, పైకి మాత్రం పెదవి కదల్పక అలాగే తిరుగుతున్నాము. వీధి వీధినుండి ఒక్కొక్క గుంపు వచ్చి కలుస్తున్నాది. ఈ మహిళా సమూహమంతా "మహిళామండలి జిందాబాద్, మహిళల కనీసపు కోర్కెలు తీరాలి" అంటూ నినాదాలు చేసుకొంటూ మహిళా మండలి మందిరమునకు చేరుకున్నారు.

సాయంకాలమువరకు అక్కడ జరిగిన చర్చలలో పిల్లల భోజనము, పోషణ వగైరా సమస్యలు ముఖ్యమైనవి. పెద్దవారి మధ్య జరిగిన ఈ దెబ్బలాటలో నోరులేని పసి పిల్లలు బాధపడకుండునటుల చూడాలని ఒక తీర్మానము ప్రతిపాదించేరు. చాల మంది దానికి అనుకూలముగా ఓటు చేయడముచే తీర్మానము నెగ్గింది. ఇక అది ఎలా అమలు జరపడమనేదే ముఖ్య సమస్య. ఇండ్ల దగ్గర వంటలు చేయకూడదని నియమంకాని, వంటే చేయకూడదని లేదు కాబట్టి ఇక్కడే (అనగా మహిళా మండలి మందిరములోనే) వంటలు చేసిన యెడల పిల్లలు, ఆడవాళ్లుకూడా భోజనాలు చేయవచ్చునని తీర్మానించారు. ఇక పిల్లల వయస్సు నిర్ణయిస్తూ పదిహేను సంవత్సరాలు దాటకూడదన్నారు. ఈ కార్యక్రమానికి డబ్బు అవసరము. మహిళా మండలి ఫండు అంత ఎక్కువగాలేదు. అందుచే ఎవరికి తోచినదివారు విరాళాలివ్వాలన్నారు. వొంటినున్న బంగారాలలో ఎవరికి తోచింది వారిచ్చారు. నేనూ మా అత్తవారు ప్రధానమునకు పెట్టిన వుంగరము ఇచ్చేను. మొదట భయపడ్డాను కాని, తరువాత ఇదీ ఒక సరదాగానేవుంది. వూళ్లోవున్న ఆడవాళ్లు, పిల్లలూ ఒకచోట భోజనాలు చేయడమువలన పెళ్లివారిల్లులాగుంది ఆ మందిరము.

రెండవరోజు స్ట్రయికు ప్రారంభమయే సరికి వూళ్లో చెప్పరానంత అలజడి ప్రారంభమైంది. హోటల్సులో భోజనానికి పూటకి మూడురూపాయలు పుచ్చుకొంటున్నారు. కాఫీ హోటళ్లలో ఇడ్లీ పావలా, కాఫీ అరణాలు. కొంతమంది వంటలు ప్రారంభించి చేతులు కాల్చుకొనీ, కాళ్లమీద గంజివంపుకునీ, హాస్పటల్సుకి పరిగెడుతున్నారు. మూడవరోజు సాయంకాలము పురుషులందరూ టౌనుహాలులో సమావేశమై మహిళల స్ట్రయికు గురించీ, వారు కోరిన కోర్కెల గురించీ చర్చించారు. వెంటనే పదిమంది సభ్యులుగల ఒక ప్రతి

నిధి వర్గము మహిళా మండలి మందిరానికి వచ్చేరు. వచ్చిన పురుషులను ఆదరించి వారు తెచ్చిన సందేశాన్ని సభవారికి తెలియజేసింది అధ్యక్షురాలు. వారు వీరు కొంతసేపు గర్షణపడి తుదకు రాజీ కొచ్చారు. ఆ వాదనలేమిటో నాకు తెలియకపోయినా రేపటినుండి స్ట్రయికు లేదని అధ్యక్షురాలు చెప్పినమాట మాత్రము విన్నాను.

ఏదో సరదాగా నలుగురితోనూ తిరుగుతున్నానుకాని, ఇంటిలో పనిపాట్లుమాని వీధులెంబడి తిరుగుతూండడము నాకు చికాకుగానేవుంది. ఈ మూడు రోజులలోను ఇంటికొకసారి వెళ్ళివస్తానంటే సుందరమ్మగారు వప్పుకోలేదు. మావారికి రానంతసేపేకాని వచ్చిందంటే అధిక కోపము. ఓ అంతట చల్లారదు. ఎందుకు ఈవూరు వచ్చానురా భగవంతుడా అని విచారించాను. మేము ఇళ్లకు చేరేసరికి రాత్రి పదకొండు గంటలయినది. నన్ను చూడగానే మావారు నవ్వుతూ "మీ ఆడవాళ్ల కోర్కెలు తీరేయా, ఇంకా ఏమేనా కోరవవున్నాయా? ఎంతకేనా తగుదురు. ఇంతమంది మగవారిని గడగడలాడించేరు" అన్నారు. వారు కోపము లేక మామూలుగా వున్నందుకు సంతోషించేను. "మీ స్ట్రయికు విజయవంతముగా నెరవేరినందుకు నిన్ను అభినందిస్తున్నా"నన్నారు. నేను ఏమీ మాట్లాడక పోయేసరికి "ఏమలావున్నావు? నేనేమేనా అనుకుంటాననా? వెఱ్ఱిదానా! సంఘంలో వున్నప్పుడు అందరితో పాటేగాని నీవు ఇంకొకలాగ ప్రవర్తిస్తే బాగుంటుందా? ఇంతకీ విశేషాలేమిటి" అన్నారు. అప్పటికి మెల్లగా తేరుకొని "నాకు ఏమీ తెలియవు, రేపు సుందరమ్మగారినడిగి చెప్తాను" అన్నాను.

## 3

మరునాడు మధ్యాహ్నము భోజనాలయిన తరువాత మా ఇంట్లోవున్న ఆడంగుల మందరము సమావేశమయాము. "మన స్త్రీలలో ఐకమత్యము లేదంటారు, కాని చూడండి ఈ స్ట్రయికు నెలా విజయవంతముగా నడపగలిగేమో" అన్నారు సుందరమ్మగారు. "మూడురోజులయేసరికి దాసోహం అని మన కాళ్లదగ్గర కొచ్చారు మగవాళ్లు. ఆడది తెగించనంతవరకేకాని రంగంలోకొస్తే, వీళ్ళు చేయగలిగిందేమీ లేదు" అన్నాదింకొక ఇల్లాలు. "అయితే సుందరమ్మగారూ! తెలియక అడుగుతున్నాను, ఈ స్ట్రయికువలన మనకు పురుషులిచ్చిన హక్కులేమిటండీ" అన్నాను. "బాగుందమ్మా! నీ వరస, నీలాటిదే రామాయణమంతా విని రామునికి సీత ఏమౌతుందని అడిగిందట. మూడు రోజులూ మాతో తిరిగి, వుపన్యాసాలు విని ఈ పాటిబోధపర్చుకోలేకపోయారా" అని హేళన చేసేరు సుందరమ్మగారు.

"అది కాదండి మాణిక్యమ్మగారూ! అసలు మనకోరిక లేమిటో మీకు తెలుసా" అన్నాదింకో గృహిణి. "ఏమోనమ్మా నాకేమీ తెలియదన్నాను." "అయితే వినండి చెప్తా" నని సుందరమ్మగారు ఉపన్యాసం ఇస్తున్న పోజులో లేచి నిలబడి "దినములో కొన్ని గంటలు విశ్రాంతి, వారానికి ఒక రోజు శెలవు కావాలని మనము కోరేము. అందుకు పురుషులు 'మీరు కోరినట్లే దినములో కొన్ని గంటలు విశ్రాంతి ఇస్తాము. వారానికి ఒక రోజు శెలవు మీకుకోరేరు. అలాకాక నెలకి మూడు రోజులు శెలవు ఇవ్వడానికి మా కభ్యంతరము లేదు. కాని మూడు రోజులూ ఒకేమారు వాడుకోవాలని ప్రార్థిస్తున్నాము. ప్రతి నెల అలా వాడుకోని వారు సంవత్సరము మొత్తము మీద ఆ శెలవు నెలరోజులవరకు వాడుకో వచ్చునన్నారు. కొంత దారిలో కొచ్చారు కదాయని సమ్మతించి స్ట్రయికు విరమించేము" అన్నారు.

"ఇంతాచేసి ఇదా తేలింది. ఈ హక్కులు మీలాంటి విద్యావతుల కిప్పుడు ఇచ్చేరు కాని ఇవి మాకు మా పూర్వులేనాడో ఇచ్చారు" అన్నాను. "ఎలాగా?" అన్నారు అందరూ ఏకకంఠముగా!

"ఏమీ లేదండీ రాత్రి తొమ్మిది లగాయతు తెల్లవారి అయిదు గంటలవరకు విశ్రాంతే, ఇంక పోతే నెలకి బైటుంటే శెలవు మూడురోజులుండనే వుంది. అలా కాక నెల తప్పితే పురిటికి నెలరోజులు శెలవేగా. ఇప్పుడు కొత్తగా ఇచ్చిన దేమిటి" అన్నాను.

నామాటవిని అక్కడ కూర్చున్న విద్యావతులందరు నోళ్లు వెళ్లబెట్టేరు. "మీరన్నది నిజమేసుమండీ, తెలుసుకోలేకపోయినాముకానీ" అన్నారు సుందరమ్మగారు.

# సమాధానం

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు

రాస్తూ రాస్తూ చటుక్కున ఆగిపోయి ఆకాశం లోకి చూస్తూ ఆలోచించసాగాడు శ్రీపతి.

ఇందాకటినుంచి అతని కలం ఎడతెగకుండా సాగిపోతున్నది. సందేహాలకు తావియ్యకుండా ప్రవాహ వేగంగా పరిగెడిపోయింది. కాని యిప్పుడు వ్రాయటం ఆపి ఆలోచించటంలో నిమగ్నమయ్యాడు శ్రీపతి.

కిటికీలోంచి దూసుకువచ్చినగాలికి పేపరు వెయిట్ క్రిందవున్న కాగితాలు రెపరెప కొట్టుకున్నాయి. అతని జుట్టు ముందుకుతూలి కళ్లమీద పడింది.

"వెధవగాలి" అనుకున్నాడు జుట్టు పైకి ఎగదోసుకుంటూ శ్రీపతి.

ప్రక్క యింట్లోంచి రేడియో శాస్త్రీయ సంగీతం వినిపిస్తోంది. శ్రీపతి ఒకసారి చెవులు మూసుకున్నాడు. "పాడురోద, రోజూ వినలేక ప్రాణం పోతూంది. ఈ వెధవ గాలికితోడు యిదొకటి" అని విసుక్కుంటూ లేచి కిటికీ తలుపులు మూసివేశాడు.

పూర్తిగా సఫలీకృతుడు కాలేకపోయాడు. సంగీతం యింకా సన్నగా వినిపిస్తోంది.

శ్రీపతి తిరిగి ఆలోచనల్లో నిమగ్నమయి పోయాడు.

"ఏమిటి ఆలోచన ?" శ్రావ్యమైన గొంతు ప్రశ్నించింది.

తలెత్తిచూశాడు శ్రీపతి - పార్వతి. శ్రీపతి జవాబివ్వకుండా ఆమె కళ్ళలోకి చూశాడు.

"మాట్లాడరేం ?"

శ్రీపతి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. "ఊ... ఆలోచిస్తున్నాను" అన్నాడు.

పార్వతి చిన్నగా నవ్వింది. ఆమె తెల్లని పలువరుస మిలమిల మెరిసింది. "బాగానేవుంది మీ సమాధానం. మీ ఆలోచన ఏమిటని నేనడిగితే...?" అంటూ అతను కూచున్న కుర్చీమీద చేతులు ఆన్చి నిలబడింది.

శ్రీపతికూడా నవ్వాడు. "చిక్కువచ్చిపడింది. కథ చివరివరకూ వచ్చిం తర్వాత ఏవిధంగా ముగించాలో తెలియటంలేదు" అన్నాడు తరువాత.

"అంటే ? కథముందు ఆలోచించకుండానే ప్రారంభించారా ?"

"ఊహు. ముందు ఆలోచించుకునే ప్రారంభిస్తాను. అయితే ముందుకుపోతున్నకొద్దీ ఊసరవిల్లిలాగా రంగులు మారుస్తుంది. ఏంచెయ్యను ?" అన్నాడు ఆలోచించటానికి ప్రయత్నిస్తూ అతను.

"సరే. తర్వాత తీరిగ్గా ఆలోచించుదురుగాని యిప్పటికి లేచిరండి."

"అబ్బే, ఏదో ఒకటి తేల్చుకోకుండానే ?"

"సాయంత్రంపూటకూడా ఎక్కడికీ పోకుండా కథలురాస్తూ కూచుంటారా ? ఎవరు ఎలాపోయినా మీకు సంబంధంలేదు. మీ కథలు మట్టుకు మీకు కావాలి. మిగతా ప్రపంచంతో సంబంధంలేకుండా" అన్నది పార్వతి గాద్గదికంగా. ఆమె నేత్రాలమాటున రెండు నీటి బిందువులు అంకురించాయి.

శ్రీపతి ఆమెవంక చూడటానికి ప్రయత్నించలేదు. సన్నగా వినవస్తూన్న సంగీతాన్ని విని లీనమయి పోయేందుకు ప్రయత్నించాడు. సాధ్యపడలేదు.

"కాస్త ఆ సంగీతం ఆపుచేయమని చెప్పుదూ — రోజూ వినలేక చచ్చిపోతున్నాను" అన్నాడు.

"వాళ్ళ నవటానికి మనకేం అధికారంవుంది? అయినా మీ గొడవతప్ప యింకో గొడవ ఆలకించటం చేతకాదుగా మీకు. ఆ సంగీతం మాత్రం ఎలా వినిపించింది?" అన్నది పార్వతి అతనివంక సూటిగా చూస్తూ — శ్రీపతి జవాబివ్వలేదు. ఆమె వంక చూసి వూరుకున్నాడు.

పార్వతి నవ్వు తెప్పించుకునేందుకు ప్రయత్నిస్తూ అంది, "పోనీ మీ సందేహమేమిటో చెప్పండి. తీర్చేందుకు ప్రయత్నిస్తాను."

శ్రీపతి విస్తుపోయాడు. పార్వతి యింతకు ముందెప్పుడూ యిలా అడగలేదు. తన కథల్ని చూసి ఆమె విసుక్కోవటం మాత్రం తనకు తెలుసు.

"సమాధానం చెప్పగలవా?" అని అడిగాడు.

"ప్రయత్నిస్తాను."

"అయితేవిను. అతనిది అదోవిధమయిన ప్రకృతి. సరిగ్గా యింట్లోవుండడు. అలాగని పాడయిపోయాడనీ చెప్పలేం. ఎక్కడెక్కడో తిరిగి అప్పుడప్పుడూ మాత్రం యింటికి వస్తూవుంటాడు. భార్య అంటే అతనికి ప్రేమవుంది. అయితే అతనా ప్రేమని ఆచరణలో పెట్టలేదు. అంటే తన ప్రేమను ప్రదర్శించుకోలేదన్నమాట. ఇదంతా క్లుప్తంగా ఎందుకు చెప్తున్నానంటే అసలు నువ్వు చెప్పవల్సిన సలహాతో యీ విషయం ఎక్కువ ప్రాముఖ్యం లేదు కాబట్టి"

"ఊఁ" అని ఆపాడు.

"ఆమెకూ అంటే భార్యకూ అతనంటే ప్రేమే. అయితే తనను సుఖపెట్టలేని భర్తతోవుండి ఏంలాభం అని వలపోసింది. చాలాకాలం బాధపడే యీ నిశ్చయానికి వచ్చిందనుకో. కథ రాయటంలో నా కిక్కడే వచ్చింది చిక్కు. ఆమె మొదట పతివ్రతే అయినా భర్త తన పట్ల చూపుతున్న ప్రవర్తననుబట్టి అతనిమీద అయిష్టం పుట్టి, చివరికి ఏవగింపుకూడా కలిగి మరొకడితో సంబంధం ఏర్పరుచుకుని అతనితో వెళ్ళిపోయేటట్లు చేయటమా? లేకపోతే—"

"లేకపోతే?"

"జీవితంమీద విరక్తిపుట్టి, భర్తకు ద్రోహం చెయ్యటం యిష్టంలేక ఆత్మహత్య చేసుకునేటట్లు చేయటమా? ఇదే తెలియకుండావుంది. ఏదిరాస్తే బావుంటుంది?"

పార్వతి ఒక నిమిషం మాట్లాడలేదు. తర్వాత ఒక నిట్టూర్పువిడిచి అన్నది! "మీ మొదటి అభిప్రాయం ఏ మాత్రం సమంజసంగాలేదు. భర్త ప్రేమగా చూడనంత మాత్రాన పరాయి పురుషుడితో వెళ్ళిపోవటమనేది సాధారణ విషయంకాదు."

"నిజమే. కాని అతనివల్ల సంసార సుఖం ఏ మాత్రం లేనప్పుడు అంతకుతప్ప ఏంచేస్తుంది? తన జీవితాన్ని సుఖడోలికల్లో ఓలలాడేటట్లు చేయటానికి ప్రయత్నిస్తుందా? లేక ఆత్మహత్య చేసుకుని జీవితం భగ్నం చేసుకోవటానికి యత్నిస్తుందా? బాగా ఆలోచించు" అన్నాడు శ్రీపతి.

"ఆడదాన్ని అంత నీచమైన దానిగా ఎందుకు భావిస్తున్నారు మీరు?" అని అడిగింది చటుక్కున పార్వతి. శ్రీపతి తెల్లబోయి ఆమెవంక చూశాడు.

"ఆడది అంత నీచమైనదిగా భావించారా? భర్త సరిగ్గా చూడనంత మాత్రాన మానమర్యాదల సంగతి ఆలోచించకుండా అవినీతికరమైన పనిచేయటానికి సంకల్పిస్తుందని ఎందుకనుకుంటున్నారు?" అని తిరిగి రెట్టించింది పార్వతి.

"అంటే? నా అభిప్రాయం పొరపాటంటావా?"

"పూర్తిగా"

శ్రీపతి కొంచంగా నవ్వాడు. "నువ్వింకా పెరటి దారినే వున్నావు పార్వతీ. సావిత్రి, చంద్రమతుల్ని దృష్టిలో వుంచుకుని మాట్లాడుతున్నావనుకుంటాను" అన్నాడు.

పార్వతి ముఖం ఎర్రబడింది. కళ్లు వింతమార్పును పొందాయి. "కాలం మారిపోయినంత మాత్రాన మనుష్యుల ప్రవర్తనలుకూడా పూర్తిగా మారిపోయాయని అనుకోవటం శుద్ధపొరపాటు. జీవితంమీద విరక్తి కలిగి ఆత్మహత్య చేసుకోటానికి సావిత్రి, చంద్రమతులతోపోల్చ నక్కర్లేదు. అభిమానంగల ఏ ఆడదైనా చేస్తుంది ఆ పనిని" అన్నది కొంచం కఠినంగా.

శ్రీపతి ఆమెవంక తీక్షణంగా చూశాడు.

"అటువంటివారున్నారు. లేరనను. కానిలోకంలో ఎక్కడో జరిగే విషయం తీసుకోవటంకన్నా కళ్ళ ముందు జరిగే విషయాన్ని కథా వస్తువును తీసుకుంటే అది సహజంగా వుంటుందనుకుంటాను పార్వతీ. ఈ విషయానికి ఆత్మహత్య చేసుకున్నదనిరాస్తే అది అసహజంగా కనబడవచ్చు."

పార్వతి ఒక క్షణం జవాబివ్వలేదు. తర్వాత అన్నది "మీరు యిన్ని కథలు రాశారు. అవన్నీ ఊహా కల్పితాలే. యదార్థ జీవితంలోని విషయాలు తీసుకొని మీరు ఏ ఒక్కటీ రాయలేదని నా అభిప్రాయం. లోకాన్ని లోకపరిస్థితుల్ని, వ్యక్తుల మనస్తత్వాల్ని అవలోకనా దృష్టితో పరిశీలించటం నేర్చుకుంటే అసలీ సందేహం మీ మనస్సుకు తట్టేది కాదేమో."

శ్రీపతి నవ్వాడు. "కాస్త విశ్రాంతి తీసుకో పార్వతీ. అంత ఆవేశ పూరితంగా మాట్లాడబోక" అన్నాడు.

పార్వతి తన ఆవేశానికి కొంచంగా సిగ్గుపడింది.

"నువ్వేది చెప్పినా నాకు అలా రాయటం సమంజసంగా కనబడటంలేదు. నేను మొదట అనుకున్న ప్రకారంగానే రాస్తాను" అన్నాడు ఒక క్షణం ఆగి శ్రీపతి.

పార్వతి యీ సారి చాలా తగ్గుస్థాయిలో "మీ యిష్టం. కాని అబద్ధాలురాసేకంటే అసలీకథను రాయటమే మానివేయండి" అన్నది. ఆమె కంఠంలో ఎంతో తీక్షణత పుట్టిపడింది.

శ్రీపతి మాట్లాడలేదు. రెండు నిమిషాలు నిశ్శబ్దంగా దొర్లాయి. "సరే. ఆలోచించి రాస్తాను తర్వాత. మనస్సులో తర్క వితర్కాలు చేసుకోవాలి" అన్నాడు.

"ఇంకా యిప్పుడు రాయరుగా"

"ఊహు"

పార్వతి గబగబ కాగితాలు, కలంతీసి డ్రాయరులో పెట్టేసింది. సంగీతం ఆగిపోయిందేమో, శ్రీపతి కిటికీ తలుపులుతీసి బయటకి చూస్తున్నాడు.

"ఏమండీ ?" ఎంతో మాధుర్యం వుట్టిపడుతూ, మృదువుగా అన్నది పార్వతి. శ్రీపతి ఆమెవంక చూశాడు. ఇందాకటి ఆవేశంలేదు ఆ ముఖంలో. ప్రశాంతత, సిగ్గు ఉట్టిపడుతున్నాయి.

"ఏమిటి ?"

"నేనొకటి అడగనా ?"

"ఊ"

"ఇవేళ ... ఇవేళ సినిమాకి పోదామా ?" పార్వతి అడగలేక అడిగింది.

శ్రీపతి విస్తుపోయాడు. ఇందాకటి పార్వతికీ యిప్పటి పార్వతికీ ఎంతో వ్యత్యాసం కనిపిస్తూంది తనకి. ఇందాక ... ఏమిటో ! ఎలాగో కనిపించింది.

చటుక్కున ఒక విషయం గుర్తువచ్చిందతనికి. "అరెరె – ఆ విషయం మరిచేపోయానే" అంటూ లేచాడు చప్పున.

"ఏమిటి ?"

"సత్యం యిప్పుడు రమ్మన్నాడు. ఇద్దరంకలిసి సినిమాకి పోదామనుకున్నాం. ఇంతకీ యిప్పుడు

నువ్వు సినిమా అంటే జ్ఞాపకం వచ్చింది" అన్నాడు త్వరపడుతూ.

పార్వతి ముఖం మాడిపోయింది. కనుకొనలలో తిరిగిన నీరును కష్టంమీద ఆపుకుంది.

శ్రీపతి ఆమె ముఖంవంక చూశాడు. దగ్గరకు వచ్చి చుబుకాన్ని స్పృశిస్తూ అడిగాడు.

"కోపమా ?"

పార్వతి మాట్లాడలేదు. అతనిమీదనుంచి దృష్టి మరల్చుకుంది.

"వచ్చేస్తాను. మీ స్నేహితు లెవరితోనయినా వెళ్ళు పార్వతీ ! ఇందాక వస్తానని చెప్పాను. తప్పితే బాగుంటుందా యిప్పుడు ?" అన్నాడు శ్రీపతి. తరువాత బట్టలు మార్చుకునేందుకు లోపలకి పోయాడు.

'మరోపావుగంటకల్లా బయల్దేరాడు శ్రీపతి. "నా కోసం యింట్లో వుండక్కర్లేదులే పార్వతీ. నువ్వుకూడా వెళ్ళు సినిమాకి" అని చెప్పాడు వెళ్తూ. పార్వతి మాట్లాడలేదు. ఆమె ముఖాన కళలేదు.

పార్వతి అలా చాలాసేపు బయటకు చూస్తూ నిలబడిపోయింది. ఆమె కన్నులనుండి రెండు నీటిచుక్కలు రాలి క్రింద పడ్డాయి.

◆ ◆ ◆

రాత్రి పదిగంటలవరకూ అతనికోసం ఎదురు చూస్తూ కూచుంది పార్వతి.

తను భోజనమయినా చేయలేదు. కిటికీముందు కుర్చీలో కూచుని నిశీథంలోకి స్ట్రీట్ లైట్లువంకా, ఆకాశంలో మెరిసే చుక్కలవంకా చూస్తూ ఆలోచిస్తున్నది.

ఏం మనిషి ? తన సంగతే పట్టించుకోకుండా అలా దూర దూరంగా తిరుగుతాడేం ? తనంటే ఎందుకు కోపం ? అతనికేం లోపం చేసింది ?

తనంటే యిష్టంలేదా ?

ఈ ప్రశ్నకు పార్వతి సమాధానం ఆలోచించుకోలేకపోయింది. అతని ప్రతిచేష్టలో యిష్టం పుట్టిపడుతూ వుంటుంది. తన మనస్సుకు కష్టంకలిగేటట్లు ఏనాడూ అతను మాట్లాడలేదు. మాటలవరకే !

కొందరి కొందరి మనస్తత్వాలు విచిత్రంగా వుంటాయని తను పుస్తకాల్లో ఎప్పుడో చదివింది. తన భర్తకూడా ఆ విచిత్ర మనస్తత్వంగల వాళ్ళ లెక్కలోనే జమ అనికూడా అనుకోవల్సి వచ్చింది యిప్పుడు. అయినా మట్టుకు యింత ఆలనా పాలనా లేకుండా జీవితాన్ని గడపటమా ?

ప్రక్క యింట్లో యిందాకటినుంచీ వినవస్తున్న శాస్త్రీయ సంగీతం ఆగిపోయింది. ఇంగ్లీషు మ్యూజిక్ ఏదో జంఝూఘాటంగా వినిపిస్తోంది.

విచిత్ర మనస్తత్వం ఎలా వుంటుంది ? వాళ్లకీ ఐహిక విషయాలేంపట్టవా ? కథలు చిత్రించటంలో వున్న ప్రయోజకత్వం, సమర్థత నిత్యజీవితంలో వుండవా ? అదే ప్రపంచం కాబోలు.

పార్వతి తలఎత్తి ఆకాశంవంక చూసింది. కిటికీ అడ్డుండటంవల్ల చందమామ కనుమరుగైపోయాడు. పార్వతి ఏదో గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించింది.

మొన్ననే ఆయనేదో గేయం అల్లారు. అందులోని భావం మాత్రం తనకు కొంచంగా గుర్తు వస్తూన్నది. "ఎందుకట్లా నవ్వుతావు చందమామా ? నాస్థితిని చూచేవా ? నన్ను విడిచి ఆయనెక్కడో దూరదేశాల్లో వున్నారు. నేనీ వియోగాన్ని సహించలేకుండా వున్నానని, ఈ విరహబాధ సైరింపలేకుండా వున్నాననీ నా సందేశం అందించవా" అని కాబోలు అందులోని భావం.

పార్వతి నవ్వుకున్నది. తను యిక్కడకి, యీ మనిషి అజమాయిషీ క్రిందకి వచ్చి నాలుగేళ్లు. ఈ నాలుగు సంవత్సరాలూ చందమామను చూస్తూ ...

దూరంగా మాటలు వినిపిస్తున్నాయి. 'వస్తున్నారు కాబోలు' అనుకుని శ్రద్ధగా ఆలకించింది పార్వతి. మాటలు దగ్గిరపడుతున్నాయి. భర్త కంఠస్వరం ఆనవాలు పట్టింది పార్వతి.

"వస్తాను బ్రదర్. రేపు కలుసుకుందాం. గుడ్ బై"

"ఓ. కే. గుడ్ బై"

స్నేహితుడు చీకట్లో లీనమయిపోయాడు. పార్వతిలేచి తలుపు తీసింది. శ్రీపతి వచ్చాడు లోపలికి.

"ఏ సినిమాకి పోయారు ?"

ఈజీఛైరులో కూలబడుతూ శ్రీపతి జవాబు చెప్పాడు. పార్వతికి సరిగ్గా అర్థంకాలేదు.

"నా అభిప్రాయం ఎప్పటికీ తప్పుకాదు. ఆ సినిమాలో ప్రపంచంలో జరుగుతున్న యదార్థాన్ని ఎంత నేర్పుగా చిత్రించాడు ? ఎంత సహజంగా వుంది ?" అని వెనక్కు వాలుతూ నెమ్మదిగా గొణుక్కున్నాడు శ్రీపతి. పార్వతి యీ మాటలు సరిగ్గా వినలేకపోయింది.

"భోజనానికి లేవరూ ?"

శ్రీపతి తలఎత్తి ఆమె వంకచూసి "అరె. చెప్పటం మరిచిపోయాను. సత్యం బలవంతంమీద హోటల్లో తినివచ్చాను. వాడిభార్య వూళ్లో లేదుట. అందుకని హోటల్ లోనే భోంచేస్తున్నాడు" అన్నాడు.

పార్వతి అచేతనంగా అతని వంక చూస్తూ నిలబడిపోయింది.

"నువ్వు తిన్నావా ?"

"ఆఁ." పార్వతి యీ మాట ఎంత ఏవగింపుతో అందో ఆమె ముఖాన్నిచూస్తే గుర్తించ గలిగేవాడు శ్రీపతి. కాని ఆమె ముఖం ప్రక్కకు తిప్పుకుంది.

శ్రీపతి నిశ్చింతగా చీకట్లోకి చూస్తూ ఆలోచిస్తూ వుండిపోయాడు. పార్వతి చాటుగా కళ్ళు తుడుచుకుంది.

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది.

"కాళ్ళు కడుక్కుని బట్టలు మార్చుకోండి" అన్నది పార్వతి అతనితో మెల్లిగా.

"ఊఁ" అంటూలేచి బద్ధకంగా వళ్ళు విరుచుకుని లోపలికిపోయాడు శ్రీపతి. పార్వతి యింకా అక్కడే వుండిపోయింది కదలకుండా.

మరో అయిదు నిమిషాలకల్లా శ్రీపతి బట్టలు మార్చుకుని వచ్చాడు. పార్వతి యింకా నిలబడి వుండటంచూసి "అరె. ఎంత రాత్రయిందో తెలుసా ? నువ్వు పడుకో" అన్నాడు ఆశ్చర్యంగా. పార్వతి దీనంగా అతనివంక చూసింది. తిరిగి యీజీఛైరులో కూచుంటున్నాడామనిపి.' గిరుక్కున తిరిగి మంచంమీద పడిపోదామా అనిపించింది పార్వతికి. మనస్సు ఎదురు తిరిగింది.

అతికష్టంమీద చిరునవ్వు తెచ్చుకుని అతని దగ్గరకుపోయి నిలబడింది.

"మీరు రారూ ?"

శ్రీపతి ఒక్కసారిగా చల్లబడి కరిగిపోలేదు. ఏదో చెప్దామనుకుని ఆమెవంక చూశాడు.

పార్వతి నవ్వుతూ అతని భుజంమీద చెయ్యివేసి జుట్టులోకి రెండవ చెయ్యి పోనిచ్చి దువ్వుతూ "ఊఁ ?" అంది. ఆమె ముఖంలో దరహాస చంద్రికలు వెల్లివిరిసిపోయినై.

శ్రీపతి భుజంమీదనుంచి నెమ్మదిగా ఆమెచేతిని తీసివేయటానికి ప్రయత్నిస్తూ తిరిగి ఏదో చెప్పపోయాడు.

కాని పార్వతి భుజంమీద చేతిని అలానేవుంచి సున్నితంగా నొక్కుతూ "రారూ" అంది మెల్లగా. ఆమె ముఖంనిండా సిగ్గుతెరలు క్రమ్మివేసినై.

"కథ రాసుకోవాలి పార్వతీ."

ఒక్కసారిగా తృళ్ళిపడింది పార్వతి. ఒక్కసారిగా ముఖం వాడిపోయింది.

"నువ్వు నిద్రపో. నేను రాసుకుని వస్తాను" అన్నాడు తిరిగి శ్రీపతి.

పార్వతి పెద్దగా దెబ్బతింది. అధరాలు కంపించినై. కళ్ళలో కోపం, ఏహ్యత, రోషం మొదలయిన భావాలు ప్రతిఫలించి రెపరెప కొట్టుకున్నాయి. ఒక్క విసురున అతని దగ్గరనుంచి కదిలిపోయి మంచంమీద వాలిపోయింది. హృదయం లోంచి దుఃఖం పెల్లుబికింది.

శ్రీపతి యీ విషయం తనకేమీ పట్టనట్లుగా నిశ్చింతగా డ్రాయరులోంచి కలం, కాగితాలు బయటకుతీసి వ్రాయటానికి ఆలోచించసాగాడు.

పార్వతి చటుక్కున లేచి కూచుని అడిగింది. "ఇందాకటి కథేనా రాస్తున్నది?"

"అవును"

"ఏమని నిశ్చయించుకున్నారు?"

"ఏమిటి?"

పార్వతి హృదయంలోంచి ఆవేశం పెల్లుబికింది. "అదే. యిందాకటి కథ ఏవిధంగా ముగిద్దామని అనుకున్నారు?" అన్నది గట్టిగా.

శ్రీపతి ఆమెవంక తాపీగా చూస్తూ "నేను అనుకున్న విధంగానే రాస్తున్నాను. ఏం?" అన్నాడు.

"రాయండి రాయండి" అన్నది పార్వతి చటుక్కున. "వద్దు. పచ్చి అబద్ధం అది. మీ కథల్లో అబద్ధాలు రాస్తారా? అది చదివే వేలాదిమందిని అబద్ధాలచే నమ్మిస్తారా?" అన్నది వెంటనే తిరిగి.

శ్రీపతి ఆమెవంక అర్థంగాకుండా చూశాడు ఒక నిమిషం. తరువాత నెమ్మదిగానే "ఏమిటీ ఆవేశం?" అన్నాడు.

పార్వతి సిగ్గుపడలేదు. "అవును. అబద్ధాలు ఎందుకు రాస్తారు? అలా ఎప్పటికీవద్దు" అన్నది గట్టిగా.

"నీకు తెలీదులే పార్వతీ. ఏవిధంగారాస్తే సహజంగా వుంటుందో, పాఠకుల్ని ఆకర్షిస్తుందో నాకు తెలుసు. మనస్సు బాగా లేనట్లుంది పడుకో" అన్నాడు శ్రీపతి లాలింపుగా.

పార్వతి కోపం వెళ్ళగక్కుతూ అతనివంక ఒకసారిచూసి పక్కమీద వాలిపోయి, దిండులో తలదాచుకుంది. ఆమె హృదయం దహించుకు పోతూంది రెండు విధాలా.

ఇవేళ కథ రాసుకోవాలి. నిన్న తలకాయ నొప్పి ... మొన్న స్నేహితుడిపెళ్ళి ... యింకో రోజు ముసుగు బిగదన్ని నిద్ర ... తర్వాత రోజు...

ఎన్నాళ్ళీ బ్రతుకు? మనసారా బ్రతక్కుండా?

పార్వతి యింక ఆలోచించుకోలేకపోయింది. హృదయం కోపంతోనూ, ఆవేశంతోనూ నిండిపోయి బుసలు కొట్టింది. కన్నీళ్లు ఎడతెగకుండా ప్రవహించి దిండును తడిపివేశాయి. ఆ మంచంమీదనే పడుకుని విలవిల్లాడింది పార్వతి.

శ్రీపతి నిశ్చింతగా కథ రాసుకుపోతున్నాడు.

◆ ◆ ◆

గడియారం కొట్టిన అలారంతో మెలకువ వచ్చింది శ్రీపతికి తెల్లవారుఝాము అయిదు గంటలకి. అతనుయీజీచైర్ లోనే పడుకుని నిద్రపోయాడు రాత్రి.

"పార్వతీ!" అన్నాడు కళ్లు నులుముకుంటూ అప్రయత్నంగా. అని పార్వతి మంచంవయిపుకు చూశాడు. ఆమెలేదు.

"ఎక్కడకుపోయింది యింత పొద్దున్నే?" అనుకుంటూ లేచాడు శ్రీపతి. రాత్రి పూర్తిచేసిన కథ బల్లమీద పేపర్ వెయిట్ క్రింద వుండి గాలికి రెపరెపలాడుతూంది.

"పార్వతీ!" అనిమరోసారి పిలవటం పూర్తికాకుండానే కథపైనమడిచి పెట్టబడివున్న మరోకాగితం కనిపించింది. కంపిస్తున్న చేతుల్తో దాన్ని తీశాడు శ్రీపతి. చదువుతుంటే అతని శరీరం వణికిపోయింది.

మహాశయా!

మిమ్మల్ని అర్థంచేసుకుందామ యిన్నాళ్లనుంచీ ఎంతగానో ప్రయత్నించాను. అయినా సఫలురాల్ని కాలేకపోయాను. చేసుకున్న భార్యనుకూడా ప్రేమించలేని మీ వూహలకు అసలు అర్థంవుందో లేదో కూడా తెలియదు.

ఇన్నాళ్లనుంచీ నా హృదయంలో ఎంతబాధా, ఎంత ఆవేదనా అణిచి పెట్టుకున్నానో మీకు తెలుసునా! మిమ్మల్ని వశంచేసుకుందామని నేనెంత ప్రయత్నించినా నా హృదయాన్ని ఎప్పుడయినా శోధించారా మీరు. శోధిస్తే మనజీవితాలీలావుండేవేనా?

భర్త అనురాగం లేని స్త్రీ ఏంచూసుకుని బ్రతుకుతుంది యింక? ఈనాలుగేళ్ల జీవితంలో ఏ ఒక్క కోరిక తీర్చారు మీరు? కనీసం సరదాగా ఎక్కడికయినా పోదామని అడిగినప్పుడు కూడా ఏదోవంక పెట్టి తప్పించుకుని తిరిగారు? భార్యయందు అనురాగంచూపటమంటే డబ్బుయిచ్చి నీయిష్టమైన చోటికి నువ్వు పొమ్మనటమా? సహపంక్తిని భోజనం ఒక్కనాడయినా లేకుండా మీదారిన మీరు పోయి నన్ను వంటరిగా బ్రతకమని శాసించటమా? డబ్బు, నగలు, చీరెలు యివేనా స్త్రీయొక్క వాంఛితాలుగా భావించారు? ఏ స్నేహితుడితోనో కలిసి సినిమానో, నాటకాన్నో చూచి ఆనందిస్తున్నప్పుడు భార్య యింటివద్ద సుఖంగా నిద్రపోతున్నదనే నమ్మారా! చంద్రుడ్ని చూస్తూ, నక్షత్రాల్ని చూస్తూ ఆరు బయట వెన్నెల్లోపడుకుని, భర్తసాన్నిధ్యం లేక విలపిస్తూన్నట్లు ఒకయింటిమ నస్తత్వాన్ని వూహించి రాసిన మీగేయం గుర్తులోవుందా?

తమరు చాలా కథలురాశారు. వాటిలో చాలావరకూ చదివాను. వాటిలో నిత్యజీవితంలో జరుగుతున్న యదార్థాలని ఆధారంగాతీసుకుని రాసినవెన్ని? అన్నీ వూహాగానం చేసి రచించినవేగా. అందుకే మిమ్మల్ని లోకం అందలమెక్కిస్తున్నది. నిజాన్ని రాయటం నిరూపించటం మీకు చేతకాదనుకుంటాను. అందుచేతనే యివేళ వాదోపవాదాలు జరిగిన కథవిషయంలో మీ అభిప్రాయం ఆమాదిరిగా వుంది. కథ ఏ విధంగా రాస్తే రమ్యంగా వుంటుందో అని ఆలోచించారుగాని ఆపాత్రను తరచిచూశారా? నిజజీవితంలో ప్రాణంతోవున్న జీవుల్నే అర్థంచేసుకోలేని మీరు కల్పనాకథలోని పాత్రల్ని అర్థంచేసుకుని రాయగలరా!

గృహజీవితంలో యిటువంటి అనుభవాలికి గురియవుతున్న గృహిణి పరాయిపురుషుడితో పరారయిపోవటమే సవ్యంగా కనిపించిందికదూ. బహుశా యీ కథరాయటం మీరు తలపెట్టకపోతే, తలపెట్టినా సమాధానం కోరకపోయివున్నట్లయితే పర్యవసానం యీ మాదిరిగావుండేదికాదేమో. యావజ్జీవితం సమాంతరాలుగానే మనజీవితాలుగడిచిపోయేవేమో. కాని యీకథ, మీసందేహం, మీ పట్టుదల నన్ను మేల్కొలిపింది. స్త్రీలగురించి, స్త్రీత్వాన్నిగురించి అంతతుచ్ఛంగా భావిస్తున్నారా? కథవిషయంలో మీకున్న అభిప్రాయం నిజంగా ఎప్పుడైనా మీమనస్సుకు తగిలితే నేనెటువంటి అపనిందపాలు కావాలి? ఒకరి ప్రవర్తనలోని లోపం వాళ్లు గ్రహించుకోలేరు. ఎదుటివాళ్లని అపార్థంచేసుకోవటం మాత్రం వాళ్లకు

బాగా చేతనవును. అందుకనే నేను యీ లోకంలో నివశించటానికి భయపడి దూరమయిపోతున్నాను.

లోకంలోని సమస్యల్ని కథావస్తువుగా తీసుకోవటం మీకేమాత్రమో తెలుసును. అయితే వాటికి సరియైన స్వరూపం యిచ్చి చిత్రించటం మీవుచాత కాదు. మీ అభిప్రాయం యిప్పటికయినా మారుతుందనుకుంటాను. మీ అనుభవాన్నయినా ఆధారంగా చేసుకుని సరియైన స్థాయిలో ఆ కథను తిరిగి రచించండి. ఇక సెలవు. నేను చేసినపనిలో పొరబడ్డాననే సందేహంనాకులేదు. ఈ ఉత్తరం మీరుచదివే సరికి నామృతకళేబరం మాత్రం పెరట్లోని బావిలో మునుగుతూనో తేలుతూనోవుంటుంది. నమస్తే."

'పార్వతి'

దీన్ని చదువుతున్న శ్రీపతి నిలువునాకంపించిపోయాడు. భయంతో ముఖం వివర్ణమయిపోయింది. "పార్వతీ!" అని అరుస్తూ భావిదగ్గరకు పరిగెత్తి లోపలికి చూశాడు.

"పార్వతీ"

ఆ మాటలు భావిలో వెర్రిగా ప్రతిధ్వనించాయి. శ్రీపతి ప్రతిమలాగా అలానే నిలబడిపోయాడు.

"మనం ఒకరొకరు అర్థంచేసుకోలేకపోయాం పార్వతీ" అన్నమాటలు అతని హృదయం అస్పష్టంగా గొణిగింది.



# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

[స్వామినాథన్, మణి, శంకర్, శామ్యూలతో బాటు రాజంకూడ స్నేహితుడయ్యాడు. ముఖ్యంగా స్వామినాథన్‌కు రాజంయెడల ప్రత్యేకమైన ఆసక్తి ఏర్పడింది. ఒకనాడు స్వామినాథన్ రాజంగారి యింటికి వెళ్ళి, ఆతిథ్యం స్వీకరించి వచ్చిన నాడు అతనిని తన యింటికి పిలచి ఆతిథ్యమివ్వదలచి ఆహ్వానించాడు. తన యింటికి వచ్చిన రాజంను గౌరవించాడు. మణి స్వామినాథన్ నాయనమ్మకు పట్నముల లోని చిత్రవిచిత్రాలనుగురించి చెప్పాడు. మరునాడు స్వామినాథన్ బడికిపోయి క్లాసులోకి పోగానే నల్లబల్లమీద 'తోక' అని వ్రాయబడి యుంది. అది ఎవరు వ్రాశారన్న విషయంగా వాదులాడుకోడం మొదలు పెట్టారు — యిక చదువండి.]

(గతసంచిక తరువాయి)

"సరే, వాళ్లలో ఎవరో వ్రాశారనుకో, నువ్వేం చేద్దామని?" సోము కొంటెగాను, తీవ్రంగాను ప్రశ్నించాడు.

"నీవుద్దేశం యేమిటి సోమూ? అదేదో సరిగా చెప్పు?" అన్నాడు మణి కోపంగా ముందుకువస్తూ.

"చూడుమణీ, చాలా కాలంనుండి నీకీ విషయం చెబుదామనుకుంటున్నాను: నేనంటే చాలా మందికి భయం, నాకున్న శక్తినిజూచి చాలామంది జడుస్తూ, జోహారు చేస్తూవుంటారని నువ్వు భావిస్తున్నావ్ కాబోలు. ఎప్పుడూ ఆ విధంగా భావించకు. నీడాబులన్నీ కుర్రాళ్ల దగ్గరగాని, నా వంటివాళ్ల దగ్గర పనికి రావన్న విషయాన్ని విస్మరించకు; తెల్సిందా? జాగ్రత్త!" అన్నాడు: మనస్సులోని కోపాన్నంతా వెడలు గక్కుతూ.

ఈ మాటలువిన్న మణికి కోపంతో కసాశం మండింది. సోముకు దెబ్బమీద దెబ్బ మణి పిరాయించి కొట్టాడు.

దీనితో వీరుభయులు మధ్యా ప్రచండ యుద్ధ జ్వాలలు చెలరేగాయ్. ఒకరిమీదొకరు పడి కొట్టుకుంటూ గ్రౌండల్లా దొర్లసాగారు. ఈ ముగ్గురికి చీదాగా మతులు పోయాయనే చెప్పాలి. సోముకు, మణికి యిటువంటి పోరాటం సంభవిస్తుందంటే - ఆ ముగ్గురూ తమకళ్లనే నమ్మలేకపోయారు. ఒకర్నొకర్ని నరుక్కుంటారేమో అని, ఆ ముగ్గురులో వొకడు హెడ్మాష్టరు దగ్గరకు వెళ్లి అందర్నీ విస్తుబరిచే యీ యుద్ధాన్నిగురించి విపులపరిచి చెప్పాడు

హెడ్మాష్టరు గడగడ వొణుకుతూ బంట్రౌతుతో గ్రౌండులోకి వచ్చాడు. ఒక స్థలంలో స్థిరంగా

యుండక వివిధ ప్రదేశాల్లోను వొకరిమీఁదొకరుపడి దొర్లుకుంటూన్న మణిని, సోముని తానొక్కఁడూ విడదీయాలని చేసిన ప్రయత్నమంతా వృధా ఐ పోయింది.

బంట్రౌతుద్వారా మరి నలుఁగురుపాధ్యాయులను హెడ్మాష్టరు పిలిపించి, వారితో సరిసమానంగా గ్రౌండల్లా తిరుఁగుతూ అతికష్టంమీఁద విడదీశారు. మణి వొంటి మీఁదబట్ట విడిపోయింది....

## ౧౧

స్వామినాథన్ వేసవి పరీక్షలు ఏప్రియల్ మాసములో జరుగనున్నవి. మునపటిమల్లే స్వామి శ్రద్ధగా చదవక, అమ్మతోనో, నాయనమ్మతోనో హస్కు కొట్టడం, లేకపోతే తిరిగేందుకు వీధిలోకి పోవటం చూస్తూంటే స్వామి తండ్రికి మతిపోతూంది. నాయనమ్మతోనో, లేకపోతే — తనతల్లితోనో హస్కు కొడుతూండటం తండ్రి కళ్ల యెప్పుడైనా పడినప్పుడు—

"చూడబ్బాయి: మీ పరీక్షలు చాలా దగ్గరకి వచ్చేశాయ్; నువ్విట్లా హస్కు కొట్టుఁగుంటూ కూర్చుంటే ప్రయోజనంలేదు. మీ అమ్మ నాయనమ్మ ఆఁగుతారుఁగాని, నీ పరీక్షలు ఆగవ్!"

అని హెచ్చరించి, చదువుకోమని పంపించేసేవారు. రాత్రి తొమ్మిది గంటలు కొట్టినతరువాత స్వామి గొంతు తనకు వినఁబడినట్లయితే. —

"యింకా పండుకోలేదా అబ్బాయ్? తెల్లవారు ఝామునలేచి, చదవనఖ్లేదనుకుంటున్నావా? పడుకో, పడుకో—" అని కేకవేసేవారు. యీ యాఖరుదశలోనే స్వామి తండ్రి వల్ల యెక్కువగా బాధపడుతున్నాడు!

ఒకనాఁడు — స్వామి, తండ్రి దగ్గరకు వెళ్ళి.—

"నా పరీక్షలు గురించి మీరింత యిదౌతా రెందుకూ?" అని ప్రశ్నించాఁడు.

"నువ్వొక వేళవుండిపోతే...?" తండ్రి ప్రశ్నించారు.

"నేనుండి పోను!"

స్వామిధైర్యంగా చెప్పాఁడు.

"సరే. నువ్వు బాగా కష్టఁబడి చదివి, బాఁగా పేపర్లు రాస్తావ్...కర్మ వశాత్తువుండిపోతే? మీ క్లాసు కుర్రవాళ్ళందరూ నిన్ను విడిచిఁబెట్టి మీఁది తరఁగతికి వెళ్లిపోతే—నీకెంత చిన్నతనంగా వుంటుందో ఆలోచించు! కాబట్టి నే చెప్పేదేమిఁటంటే - యీ చిల్లర తిరుఁగుళ్లు కట్టిఁబెట్టి, బాఁగాచదివి, విజయం సంపాదించాలి. సెలవుల్లో నీయిష్టం వచ్చినట్లు తిరుఁగు ఎవరొద్దన్నారు?" అని మరోమారు పెద్దగా హెచ్చరించారు!

రాజం, మణి, బతానిగింజ, శంకర్ మొ॥గు తన స్నేహితులు తనను విడిచి పుచ్చి పైతరగతి పోవటం, క్రింద తరగతివారు తనకు స్నేహితులుగా మారటం తనకెంత చిన్నతనంగా వుంటుంది? పాత స్నేహితులు ముందర తను తలెత్తుఁగు తిరఁగఁగలఁడా? ముఖ్యంగా 'ఓ' కన్ని వొంకలున్నాయో తెలియని మణి ప్యాసైపోయినట్లయితే - తనను యెంత హేళన చేస్తాఁడు? భవిష్యత్తు నొక్కపర్యాయము వూహించుకోఁగానే, స్వామి మనస్సంతా వికలమైపోయింది. అతని లేత మెదడులో యేవో చెప్పరాని కలవరములు బయలుదేరాయ్. తానివాల్టినుంచి శ్రద్ధగా చదివి, విజయం సాధించాలని దీక్షేఁబూనాఁడు!!

పరీక్షలింకా రెండు దినములున్నాయనఁగా - స్వామి, పరీక్షకుఁగావల్సిన జాబితాను కాగితం మీఁద రాయసాగాఁడు:

| | |
|---|---|
| రూళ్లులేని తెల్ల కాగితములు...20 తావులు | |
| పాళీలు | ... 6 |
| సిరా | ... 2 బుడ్లు |
| క్లిప్పులు | ... |
| పిన్నులు | ... |

తను రాసిందంతా తిరిగి చదివేఁడు. యీ జాబితా స్వామికి సంతృప్తికరంగా లేకపోయింది. తన కోర్కెలింత తక్కువగా యుంటాయా? స్వామెన్నఁడూ వూహించలేఁదు! తను జాబితాను రాసేముందర షుమారు 3, 4 తావులను రాద్దామనకున్నాఁడు. తను రాసిన జాబితా నొకమారు విమర్శించ సాగాఁడు:

మొదఁట — 'రూళ్ళులేని తెల్లకాగితములు 20 తావులు' అనివుంది. తను తెల్లకాగితములే కావాలని యెందుకు రాయాలి? అనుకున్నాఁడు! స్వామి రాసేటప్పుడు కుడిచేతివయపు ప్రారంభించిన వాక్యం యెడంచేయి మూలకు పోతూవుంటుంది. ఇట్టువంటి రాతలు పరీక్షాధికారులంగీకరించరు! అందుకు తెల్ల కాగితములుకంటే రూళ్ళకాగితములలో రాయటం మంచిదనుకున్నాఁడు!

తరువాత — 'పాళీలు; యింతకీ పరీక్షకు యెన్ని పాళీలు కావలనుకున్నాఁడు? ఒకటి, రెండు, లేదా. ఐఁదు; యింతే! తరువాత — 'సిరా,' తన పరీక్షకెంత సిరా కావాలో తెలియక తికమకపడ సాగేఁడు. తరువాత — పిన్నులు, క్లిప్పులెన్ని కావాలో? అని దీర్ఘాలోచనలో పడ్డాడు.

పైజాబితాను రద్దుపరుస్తూ, ఈ క్రింది విధంగా రాయసాగాడు:—

| | | |
|---|---|---|
| తెల్ల కాగితములు | ... | 20 తావులు |
| రూళ్లుగల కాగితములు | ... | 10 ,, |
| నల్లసిరా | ... | 1 బుడ్డి |
| క్లిప్పులు | ... | 1-6-12 |
| పిన్నులు | ... | 6-12 |

యిప్పటికీ యీ జాబితా స్వామికి సంతృప్తికరంగాలేఁదు. అప్రయత్నముగా రెండు విషయాలు జాబితాలో రాయకపోవటంచాత, 'కార్డుబోర్డు 'పాడ్,'' (Cardboard pad) ఒకటి, ఖర్చులనిమిత్తము — 'ఒక రూపాయి' అని జాబితా చివర భాగాన్ని వ్రాశాఁడు.

స్వామితండ్రి యాఫీసులో చాలా తొందర పనులలో నిమగ్నులైవున్నారు. అతని సమక్షంలో జాబితా పట్టుగుని, బిక్కమొఖంతో నిలుఁబడ్డాడు. పనిలో యెక్కువగా నిమగ్నులైవుండటంచాత, తన ముందర నిలఁబడినవాఁడు స్వామని, తండ్రి గుర్తించి యుండలేదు.

కొంతవరకు నిలుబడి, భోజనముల సమయమందు యీ విషయమై ప్రస్తావిస్తే, తన కోర్కె యీడేర వచ్చునని, స్వామి బయటకు జారుకున్నాఁడు. ఎప్పుడైతే స్వామి గది తలుపుదాఁటి వెళ్లాఁడో తండ్రి. —

“ఎవరదీ?” అని ప్రశ్నించారు.

స్వామికి గొంతులో పచ్చివెలక్కాయ పడినంత బాధ బయలుదేరింది. ముందుకు పోలేఁడు; వెనక్కుగాలేడన్న స్థితిలోకి వచ్చాఁడు!

“ఎవరదీ అంటే? —” స్వామి తండ్రొక్కమారు సింహంమల్లే బొబ్బరించారు. బిక్కముఖంతో, వొణుకుతూ తన సమక్షమునకొచ్చిన స్వామి వయిపు తండ్రి తీక్షణంగాఁ జూస్తూ.

“నువ్వేనా?”

“అ అ వు ను!” అస్పందకంఠంతో అన్నాఁడు.

“వెధవా, 'ఎవరదీ, ఎవరదీ?' అని కంఠం చించుకునేలా అరుస్తూంటే, 'నే' నని, సమాధానం చెప్పఖర్లా? వెధవది! ఒక్కనిముషం యీ ఇంటిలో శాంతి దొరకదుఁగదా? ఎవడో ఒకవెధవ యేదో వొకఁటి తెస్తూనన్ను బాధిస్తూనేవుంటాడు; కొంపఁదీసి, విశ్రాంతి లేక చావనుగదా?

యీరోజుల్లా నా గదికి రావొద్దని మీ అమ్మతో చెప్పు. అప్పులవాళ్లు డబ్బుకువస్తే పొమ్మనమని చెప్పు యేమిటా కాగితం? —” అని ప్రశ్నించారు.

“ఏమీలేఁదు నాన్నగారూ” అంటూ, జేబులోకి నెట్టబోతూంటే, తండ్రి బలవంతంగా లాక్కున్నారు.

“ఏమిటిదంతా. అఁగి —” అంటూ దీర్ఘనిశ్వాస విడిస్తూ, కుర్చీవెనక్కు చేరఁబడ్డాఁడు.

"యిది—నా—పరీక్షల-జాబితా!" అని మెల్లిగా చెప్పాఁడు!

"ఏం పరీక్షల జాబితావయ్యా?" తండ్రి రెట్టించిన గొంతుతో ప్రశ్నించారు!

"మా పెద్ద పరీక్షలు యెల్లుండినుండి ప్రారంభమౌతున్నాయని మీకిదివరకు చెప్పానే!"

"అందుకు నువ్వు కట్టువిప్పినగాడిదలా తిరుఁగుతున్నావా? ... ఏం జాబితావయ్యా యిది? అఁ? రూపాయలు, అణాకానులు, పైసలు ఆకాశంనుండి రాల్తాయనుకుంటున్నావా? అని హుంకరించారు!"

యీ విధంగా తండ్రి అంటారని స్వామి కలలోఁ గూఁడా భావించియుండలేఁడు.

"నీకేమీ కావల్సినా నన్నడిగి తీసుఁగో, నా దగ్గర క్లిప్పులున్నాయ్; బజారులో కొనవల్సిన అవసరంలేఁదు; నీకెందుకయ్యా, పేడ్? మీతరగతిలో డస్కు_పెట్లెలు లేవూ? మా కాలంలో, నేను చదువు కొన్న రోజుల్లో పలకలతో సరిపోయ్యేది. కానీ—నీకిప్పుడు—పెన్నూ, పేపరు, యింకూ, పేడూ (pad) కావాలంటున్నావ్!" అంటూ జాబితా నుండి pad ను యెర్ర పెన్సిలుతో రద్దుపరిచారు. ఆ జాబితానుండి pad రద్దుకావటం: మిగతా జాబితా అంతా చిందరవందరగా స్వామికి కన్పడసాగింది.

స్వామి తలుపుదాఁటి వెళ్లేఁగానే, తండ్రి వెనక్కు పిలిచారు.

"చూడబ్బాయ్, ఆ చంటి వెధవనక్కడనుండి తీసేయ్ బాబూ; వాఁడుఏడిచేఏడుపు వినలేకుండా వున్నాను! వాడెందుకేఁడుస్తున్నాఁడో నా కర్థం కావటంలేదు; మీఅమ్మకు చెముఁడుందా, లేక పోతే కఠినీకృతహృదయురాలా? వాఁడట్టా గుక్క తిప్పుకుండా ఏఁడుస్తూంటే, దాని చెవుల్లో చెట్లు మొలిచాయా?-" అంటూ, కోపఁగించుకున్నారు!

## ౧౨

తడియారిన పెదిమలతో, యింకుతో నిండిన వ్రేళ్ళతో, ఒక చెంపవుత్సాహం, వేరొక చెంప నిరుత్సాహముతో నిండిన ముఖంతో, స్వామి పరీక్షా హాలునుండి వరండాలోనికి వచ్చి నిలుఁబడ్డాడు. తన లాఁగు 20 నిముషములకు ముందుగా అందరు కుర్రాళ్లూ తమ పేపర్లు యిచ్చేస్తే బాఁగుండునను కున్నాఁడు. యీ ప్రపంచంతో సంబంధం తనకు లేఁదన్నట్లుగా గోడకు చేరఁబడి రాసుఁగు పోతున్నాఁడు, శంకర్!

రాజం—యిద్దరు ధర్డుఫారం కుర్రవాళ్ల మధ్యను గూర్చొని, వ్రాత మెషీనుమల్లే రాసుఁగు పోతున్నాఁడు!

పేపరిచ్చిన దగ్గరనుండి మణి వాసాల వయిపుఁ జూస్తూ, దీర్ఘాలోచనలో పడ్డాడు! అంతేమీ చిక్కకుండావుంది.

'బతానిగింజ' మాత్రం పేపరంతా అన్సరుఁజేసి, సీటు వెనక్కు చేరబడి, తాను రాసిన సమాధానములను సరిఁజూస్తున్నాఁడు!

అంతవరకూ విపరీతంగావున్న పాళీల 'గరగర'లు, పేపర్ల 'పరపర'లను నిశ్శబ్దదేవత చెదరఁగొట్టి, తానాగదినావరించుఁగుంది.

స్వామికి - బయటకు వేగిరం వచ్చివేయాలని వుంది; తనెంతకాలమాహాలులో వుండఁగలఁడు? సాయంత్రం తమిళ పేపర్ను 5 గంll వరకు రాసేందు కవకాశమిచ్చారు. ఇచ్చిన ఆరు ప్రశ్నలలో - మొదఁటి ప్రశ్నకు సమాధానం తృప్తికరంగా రాసినట్లు భావించాఁడు; రెండవప్రశ్న మాత్రం అనుమానంగావుంది; మూడవప్రశ్న కొద్ది తృప్తి నిస్తున్నాది; నాల్గవప్రశ్న పూర్తిగా తప్పని తనకుఁ బూర్తిగాఁదెల్సు (అయినప్పఁటికీ - యీ ప్రశ్నకు సమాధానం స్వామి కింతవరకు తెలియనే తెలియదు!)

ఆఖరు ప్రశ్నకే యెక్కువుగా మార్కులు వస్తాయని స్వామెక్కువుగా యాశించాడు ... ఆఖరు ప్రశ్నకు సమాధానం రాసేటప్పుడు, దాని నొకమారు చదివి, సమాధానమును ఒక్క నిముషంలో రాసి పారేశాడు.

"బ్రాహ్మణుడు - పులి అనే కథనుండి నీవు నేర్చుగోవల్సిన నీతియేమి? -"      6 మార్కులు.

అని వుంది. దీనిలో నీతుంటుందని స్వామెన్నడూ వూహించలేదు ! అయినప్పటికీ సమాధానం యేమిటా అని ఒక్క నిముష మాలోచించి, ఈ క్రింది విధంగా రాయసాగాడు !

'పులి బంగారపు కడియం ఇస్తానన్నప్పు, మనం పుచ్చుగోరాదు ; దీనికి చాలా కారణములున్నాయ్, స్థలాభావంచాత రాయలేకపోయాను, పరీక్షాధికారులు మన్నించాలి ; లేదా, బంగారంమీద పేరాశచేతనే ఒకడు తన జీవితమును పరిదగ్ధం చేసుగున్నాడు' అని. యీ ప్రశ్నకే యెక్కువమార్కులు వస్తాయని గాఢతరంగా విశ్వశింపసాగాడు.

అన్ని ప్రశ్నలకూ సమాధానములు రాసిన తరువాత, గోడ గడియారంవయిపు జూశాడు : ఇంకా అరగంట మాత్రమేవుంది వ్యవధి ! ! తనీ అరగంట కాలం యేం చేయాలి ? అందరికంటే తనే ముందర పోవాలని, స్వామి యభిలాష ! ముందుపోతే అందరూ యేమనుకుంటారో ? తన మల్లే అందరూ వేగిరం యెందుకు పేపర్లు రాయకూడదూ ?

వరండావయపు పరిశీలనగా జూశాడు : ఎవరూ పేపర్లిచ్చి యిళ్ళకు పోతున్నట్లు తన దృష్టి పసికట్ట లేకపోయింది. యిదే తనకాఖరుపరీక్ష ! యిక తను స్కూలుకు రావల్సిన అవుసరంలేదు. తనకి వచ్చినట్లు నడుచుకోవచ్చు ; యింటి దగ్గర చదవమని తండ్రి తాలూకు నిర్బంధం తనకికవుండదు. ఉదయం, మధ్యాహ్నము, సాయంత్రము తన చిత్త మొచ్చినట్లు తిరుగవచ్చు ! పుస్తకాలను చిత్తంవచ్చిన దగ్గరకు గిరవాటువేసి - నాయనమ్మను - అనంత గాథలను చెప్పమని నిర్బంధించవచ్చు !

తన నొక సూపర్‌వైజరు కనిపెడుతున్నట్లు స్వామి గుర్తించాడు ! వెంటనే తాను రాసిన పేపర్ను సరిజూస్తున్నట్లు నటింపసాగాడు ! మొదటిప్రశ్న తాలూకు సమాధానం చదవగానే, బోరు (Bore) గా కన్పింపసాగింది. పుటలు త్రిప్పుతూ ఆఖరు ప్రశ్నమీద తన దృష్టి నిలిపాడు ... యిద్దరు ముగ్గురు కుర్రవాళ్లు పేపర్లిచ్చి బయటకుపోవటం స్వామి గమనించాడు. వెంటనే తన పేపర్ను మడతపెట్టి, దానిమీద.—

'తమిళం                                        తమిళం
డబ్లు. యస్. స్వామినాథన్,
I-వ ఫారం, ఏ. సెక్షను,
ఆల్బర్ట్ మిషన్ స్కూల్,
మాల్‌ఘుడి,
సౌత్ యిండియా,
ఆసియా—' అని వ్రాశాడు.

## B

గంట మ్రోగింది. వరస వరసల్ని కుర్రవాళ్లు పేపర్లిచ్చివేసి బయటకు వచ్చేస్తున్నారు.

"ఆఖరు ప్రశ్నకు నువ్వేమిటి వ్రాశావయ్యా ?-" స్వామి తన స్నేహితు నొకణ్ణి ప్రశ్నించాడు !

"ఏది ? నీతి ప్రశ్నా ? ... నీకు జ్ఞాపకంలేదూ మాష్టారేమిటని చెప్పారో ? ... బంగారంమీద పేరాశచేతనే బ్రాహ్మణుడు తన అసువులు కోల్పోయాడు" అని చెప్పాడు.

"అక్కడ బంగారం యెక్కడుంది ? ... స్వామి నిలదీసి అడిగాడు ... అక్కడున్నది ఒక్క బంగారపు కడియమేగదూ ? ఆ ప్రశ్నకు నువ్వెంత వ్రాశావ్ ?"

"ఒకపుట !" స్నేహితుడన్నాడు.

ఈ సమాధానం స్వామికెంత మాత్రం తృప్తిపర్చ లేకపోయింది.

"ఏమిటీ? ఎక్కువ రానేందుకందులో పస లేదే?" స్వామన్నాడు! కొద్ది నిముషముల తరువాత రాజం, శంకర్ కనబడ్డారు.

"ఏమర్రోయ్, పేపరెట్లావుంది?" అని స్వామి ప్రశ్నించాడు.

"నీ కెట్లాగుందో ముందు చెబ్దూ చూద్దాం!" శంకరన్నాడు!

"నాట్ బేడ్ (Not Bad)"

"తమిళం గురించే నేనేమి భయపడినా భయపడాలి. నాకు పాసుమార్కులు వస్తాయని ఆశిస్తున్నాను!" రాజం అన్నాడు!

"లేదు. అంతకన్నా యెక్కువే! క్లాసు రావచ్చు!" శంకరన్నాడు!

"యిటు చూడండి! యీ నీతి ప్రశ్నకు కొందరు మూర్ఖులు ఒక పేజి వ్రాశార్ట!" స్వామి నిశితంగా విమర్శించాడు!

"పుటకు మూడు వంతులు పైగానే నేను వ్రాశాను!" రాజం అన్నాడు.

"సంగోర్కు పైగా నేను వ్రాశాను!" అన్నాడు శంకర్!

"నేను సంగోర్కుపైగా వ్రాశానులెండి!" అని స్వామివాళ్ళదగ్గర బొంకాడు!

"ఏమర్రా, రేపటినుండి మనకు స్కూలు లేదు, మీకు తెలుసా?"

"ఓఁ! ఆ విషయమే నేను మరచిపోయాను—" రాజం అన్నాడు!

"అయితే - నువ్వీ సెలవులలో యేమిచేద్దామని?" ఒకడు ప్రశ్నించాడు.

"నా పుస్తకాలను వంటవాయ్యి కిచ్చేద్దామని అభిలాషపడుతున్నాను!" అని, స్వామన్నాడు!

"యీ సెలవుల్లో చదువుకునే నిమిత్తము, మా నాన్నగారు—సిందుబాదు, ఆలీబాబా మొదలగు పుస్తకములు తెచ్చారు" శంకరన్నాడు!

ఆ సమయంలో—మణి యెక్కణ్ణుంచో వచ్చాడు "వెధవది, కాలం చాలిందిగాదు! లేకపోతేనా, యిచ్చిన ప్రశ్నల కన్నిటికీ — చిత్రిబెట్టి, సానబెట్టి, మెరుగుబెడుదును. అయినప్పటికీ — ఆఖరు ప్రశ్నను వొదల్లేదులెండి!"

అదే సమయంలో, 'బఠాణీగింజకూడా' అక్కడ కొచ్చాడు!

"హలో, శంకర్, ఫష్టుక్లాసేనా?" అని ప్రశ్నించాడు!

"లేదు. కత్తా కఠినంగా 35 మార్కులు రావొచ్చు!"

"దొంగ తొత్తుకొడకా, అబద్ధమాడుతున్నావ్; నీకు ఫష్టుక్లాసు వచ్చినట్లయితే, నీ నాలుక తెగ్గోస్తాను!" అని మణన్నాడు! పదిహేను నిముషముల తరువాత, మరల గంట మ్రోగింది. ఒక హాలులో స్కూలంతా హాజరైంది! ప్రతీవాడి ముఖంలోను సంతోషం సముద్రంలా పొంగుతూంది.

హెడ్మాష్టరు ప్లాటుఫారంమీదకు వచ్చారు; గోల తగ్గిన తరువాత, వుపన్యాసం చెప్పారు. ఆ వుపన్యాసంలో — స్కూలు, జూన్ 19—వ తేది వరకు మూయబడుతుందని, మరల 20—వ తేదీని తెరవబడుతుందని, యీ సెలవు దినములను వృధా పర్చక ముందు తరగతులకు సంబంధించిన పుస్తకములు చదువుతారని, యీ సంవత్సరం యెక్కువ మందిని ప్రొమోషన్ చేసే వుద్దేశం తనకుందని, మొదలగు విషయాలు గురించి వుద్ఘాటించారు.

(సశేషము)

# విండర్ మియర్ సతి విసనకర్ర

రచయిత : ఆస్కార్ వైల్డ్

అనువాదం : సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

డా.ప్ర:-చిన్న సమావేశం, త్వరలో ఐపోతుంది. కొద్దిమందే వస్తారుకూడా.

బె.రా:-(ఎల్' సోఫామీద కూర్చుని) అవును కొద్దిమందే రావాలి. అగాతాని తీసుకువెళ్లడానికన్నా, మా ఆయనకి తగిన సంఘం కావాలన్నా మీ యింటిలాటి బహుకొద్ది ఇళ్ళలోనే అనువుగా ఉంటుంది. ఈ మానవ సంఘం రాను రాను ఏమికాబోతున్నదో నాకు తెలియడంలేదు. ఎక్కడికి వెళ్లినా తుంటరులే కనబడుతున్నారు. మా యింటి విందులికికూడా అటువంటివాళ్లు వస్తూ ఉంటారు - మరిపిలవకపోతే ఈ మగవాళ్లకి ఎంత కోపం అనుకుంటారు? ఎవరైనా వీళ్లని నిషేధిస్తేనేకాని లాభం లేదు.

విం.స:-నేనుచేస్తా. ఏపాటి నిందకిలోనైన వాళ్లైనా నాయింటికి రావడానికి వీలు లేదు.

డా.ప్ర:-విండర్ మియర్ సతిగారూ, అలాగనకండిసుమా, నాలాటివాడికి కిక్కడ స్థానం ఉండదు!

బె.రా:-మగవాళ్లని గురించేమీ ఫర్వాలేదు. ఆడవాళ్ల విషయం మనం గమనించాలి. మాలో కొంతమంది మంచివాళ్లే. అయినా మంచివాళ్లని ఎవరూ గుర్తించేట్టుగాలేరు, మూలకినెట్టేస్తూ ఉన్నారు. అప్పుడప్పుడు చివాట్లు పెడుతూ ఉంటేనేగాని మా భర్తలకి మేము ఉన్నట్లే తోచదు. అప్పుడప్పుడు చివాట్లు పెడుతూ ఉంటేనే కాని మజాలేదులెండి.

డా.ప్ర: ఈపెళ్లి అనే ఆటలో మనం ముఖ్యంగాచూసే తమాషా ఏమిటంటే, భార్యలు అన్ని విధాలైన గెలుపులూ పొందినా ముఖ్యమైన ఒక వస్తువుని మాత్రం కోల్పోతూ ఉంటారు.

బె.రాణి:-ముఖ్యమైన ఒక వస్తువా? అంటే భర్త అనేనా మీ ఉద్దేశం?

డా.ప్ర:-నేటి భర్తలకి అది సరియైన పేరే.

బె.రా:-డార్లింగ్టన్ ప్రభూ, మీరు చాలా! చెడ్డవారండి.

విం.స:-ఆయన ఎప్పుడూ వేళాకోళంగానే మాట్లాడుతూ వుంటారు.

> **మతి మరుపు**
>
> రంగయ్య:- ఏమోయ్! చీకటిగ వుంది కండ్లు కనబడటం లేదు. దీపం వెలిగించు.
>
> భార్య:-నిప్పు పెట్టె దొరకలేదండి. వెతుకు తున్నాను.
>
> రంగయ్య:-అయితే దీపం వెలిగించిచూడు - దొరుకు తుంది.
>
> "ఎస్నెస్"

డా.ప్ర:-విండర్ మియర్ సతీ, మీరలాగనడం బాగాలేదు.

విం.స:-మరి మీరు జీవితాన్ని గురించి అంత చులకనగా ఎందుకు మాట్లాడ తారు ?

డా.ప్ర:-మన బుర్రల్ని ఎప్పుడూ వేడెక్కించేటంతటి క్లిష్ట సమస్యగా మనజీవితాన్ని నేను పరిగణించను.

['సి' తలుపువైపు కదుల్తాడు]

బె.రాణి:-ఆయన ఉద్దేశమేమిటి ? నేను మందమతిని, నాకు కాస్త అర్థమయ్యేలాగ విడమర్చి చెప్పండి, డార్లింగ్టన్ ప్రభూ.

డా.ప్ర:-(వెనక్కి వచ్చి టేబిల్ వెనకాల నిల్చుని) నేను విశదంగా చెప్పకుండా ఉండడంమేలు. విడమర్చి చెప్పితే అందులో ఇంక స్వారస్యమేమీలేదు. (వస్తాబెర్రిక్ రాణి కరస్పర్శచేస్తాడు). ఏమండీ (ముందుకువచ్చి) విండర్ మియర్ సతిగారు మరి నేను వెళ్ళివస్తా. నేను రాత్రి విందుకి రావచ్చా ? నన్ను రానిద్దురూ.

విం.స:-ఆహా తప్పకుండారండి. అయితే ఒకటి. మీపిచ్చిపిచ్చికబుర్లు మాత్రం కట్టిపెట్టండి.

డా.ప్ర:-(చిరునవ్వుతో, ఓహో, మీరు నన్ను సరిదిద్దజూస్తున్నారన్నమాట. సరిదిద్దజూడడం - అపాయకరమైనపని సుమా.

[సెలవు తీసుకుని 'సి' గుండా వెళ్ళి పోయాడు]

బె.రా:-(లేచి, 'సి' దగ్గిరకివెళ్ళి) ఎకసక్కెంగా మాట్లాడినా హాయిగా మాట్లాడు తున్నాడు. నాకు అతనంటే బలే యిష్టం. అతను వెళ్ళిపోవడం బహు మంచిది! మీ రెంత బాగున్నారండీ ? మీ గౌనులు ఎక్కడ కుట్టిస్తున్నారేమిటి ? నాకు మిమ్మల్ని చూస్తే చాలా జాలిగా ఉన్నది. (సోఫాదగ్గిరకివెళ్ళి, విండర్ మియర్ సతి పక్కన కూర్చుంటుంది) అమ్మాయి అగాతా!

[లేస్తూ]

అగాతాకుమారి:-ఎందుకమ్మా

బె.రా:-అదుగో ఆ ఫోటో ఆల్బమ్మును చూచిరా.

అ.కు:-సరే.

[ముందుకు జరిగి 'ఎలీ' టేబిల్ దగ్గరకి వస్తుంది]

బె.రా:-పాపం, ఈ పిల్లకి స్విడ్జర్లండుకి సంబంధించిన ఫోటోలంటే తీరని వ్యామోహం. వట్టి అమాయకపుపిల్ల. మార్గరెట్, మిమ్మల్నిచూస్తే నాకు నిజంగా జాలి వేస్తుంది.

విం.స:-(చిరునవ్వుతో) ఎందుచేత ?

బె.రా:-ఆ పాడుముండవల్లే. పైపెచ్చు దాని ముస్తాబు బోగందాని ముస్తాబులా గుంటుంది. నా తుంటరి తమ్ముడున్నాడు చూసేరు అగస్టస్, అతనికి ఇదంటే తీరనివెర్రి దాని వలలో పడిపోతాడేమో కూడా. దాని ప్రవర్తన ఏమీ బాగా లేదు. దానిని సంఘంలోనికి రానివ్వ కూడదు. ఇంతకుముందు ఇది అష్టమైనవాళ్లతో తిరిగిందని వినికిడి.

విం.స:-ఇంతకీ మీరు ఎవర్ని గురించి మాట్లాడుతున్నారు ?

బె.రా:-మిసెస్ ఎర్లిన్ను గురించి.

విం.స:-మిసెస్ ఎర్లిన్నా ? ఆ పేరు ఇంతవరకూ నేను ఎక్కడా వినలేదే. ఆవిడకి నాతో సంబంధమేమున్నది ?

బె.రా:-అమ్మాయి, ఆగాతా.

అ.కు:-ఏమి అమ్మా.

బె.రా:-డాబామీదికి వెళ్లి అస్తమిస్తున్న సూర్యుణ్ణి చూచిరా.

అ.కు:-వెళ్తానమ్మా.

['ఎలీ' కిటికీగుండా వెళ్లిపోతుంది]

బె.రా:-పిచ్చిపిల్ల. అస్తమిస్తున్న సూర్యుని చూడడం అంటే దానికి ఎంతో సరదా. దానివన్నీ ఉత్కృష్ట గుణాలే. అయినా ప్రకృతికంటే రమణీయమైనది లోకంలో మరింకేదిఉంది చెప్పండి ?

విం.స:-అది సరేగాని, రాణీగారు, ఈ మనిషిని గురించి నాతో మాట్లాడవలసిన అవసరం ?

బె.రా:-మీకు ఇంకా తెలీదా ఏమిటి ? విషయం తెల్చుకుంటే మాకు చాలా బాధగా ఉంటుంది. నిన్నరాత్రే జాన్సన్ సతిగారింట్లో అంతా అనుకుంటున్నారు విండర్మియర్ ప్రభువులాటి సత్పురుషుడు ఇలాగ ప్రవర్తిస్తున్నాడేమిటా అని.

విం.స:-నాభర్తగారా - అటువంటి దానితో ఆయనకి సంబంధమేమున్నది ?

బె.రా:-అదేనమ్మా అసలు సంగతి. ఆయన ఎప్పుడూ దాని ఇంటికి వెడుతూ ఉంటాడు. వెడితే గంటలకొద్దీ అక్కడే ఉండిపోతాడు. ఆయన అక్కడ ఉన్నంతసేపూ అది ఇంకొకళ్ల నెవర్నీ చూడదు. ఇంతకీ దాని ఇంటికి ఎంతోమంది స్త్రీలు వెడుతున్నారనికాదు నా ఉద్దేశం, పొరుగింటి పుల్లకూర రుచి

చూచే మగవాళ్లున్నారే, వాళ్లు చాలా మంది అక్కడికి వెడుతూ ఉంటారు. అందులో నాతమ్ముడు అగస్టస్ ఒకడు. విండర్మియర్ గారి ఈ ప్రవర్తనే అందరినీ కలతబెడుతుంది. మేమింతవరకూ ఆయన్ని ఆదర్శప్రాయుడైన భర్తగా పరిగణించేవాళ్లం. ఇప్పటికీ అందుకేమీ సందేహంలేదు. నా మేనకోడళ్లున్నారు చూశారూ ఆ సెవైల్ పిల్లలు, చూడ్డానికి సర్వసాధారణంగా ఉన్నా ఇంటి పనుల్లో అందెవేసిన చెయ్యిలు, మంచి వాళ్లుకూడా, వాళ్లు ఎప్పుడు చూచినా కిటికీ దగ్గర కూర్చుని బీదవాళ్లకని ఏవేవో వస్తువుల్ని తయారుచేస్తూ ఉంటారు, స్వార్థంతో నిండిపోయిఉన్న ఈ కాలంలో వాళ్లామాత్రం మానవ సేవ చెయ్యడం నిజంగా మెచ్చుకో దగ్గదే; చూశావూ ఈ పాడు మనిషి సరిగ్గా వాళ్ల యింటికి ఎదురింటినే ప్రవేశించింది. ఆ వీధిలో అంతా మర్యాదస్తులే ఉన్నారు. కాలంగడిచే కొద్దీ మనం ఏయేకష్టాలుపడాలో! విండర్మియర్ ఆ యింటికి వారానికి అధవా నాలుగైదుసార్లైనా వస్తారని వాళ్లు నాతో చెప్పేరు. అలాగాయన రావడం వాళ్లువాళ్ల కళ్ళార చూస్తున్నారు. నీలాపనిందలు వెయ్యడానికి వాళ్లకిష్టంలేకపోయినా, ఈ విషయాన్ని చూస్తూ చూస్తూ వాళ్లెలా ఊరుకో గలరు? అందుచేత ప్రతీవాళ్లతోటే చెప్పేస్తున్నారు. అసలు సంగతేమిటంటే అది ఇక్కడికి వచ్చినప్పుడు వట్టి చేతుల్తోవచ్చినా ఈ ఆరునెలల్లోపుగా ఎవరిద్వారానో బాగా డబ్బు సంపాదించింది. లేకపోతే అంత చక్కని ఇల్లూ, రోజూ సాయంత్రం పార్కుకి వచ్చే ఆ అందమైన గుర్రబ్బగ్గీ ఇత్యాది ఎక్కడనుండివస్తాయి చెప్పండి? ఇదంతా విండర్మియర్ ప్రభువుగారిచేతి సలవేఐ ఉంటుంది.

విం.స:-అబ్బా, నేను నమ్మలేను!

బె.రా:-ఇది ముమ్మాటికి నిజం, లండన్ నగరం అంతా కోడై కూస్తున్నది. అందుకనే విండర్మియర్ ప్రభువుని మీరు హాంబర్గోకైనా లేకపోతే ఎయ్కైనా ఎలాగో వోలాగ తీసుకు పోవడం ఉత్తమం అని సలహా ఇవ్వడానికనే నేను ఇక్కడికి ఎంతో ఆతురతతో వచ్చేను. అలాగ ఆయన్ని తీసుకుపోతే ఆయన అన్యాసక్తులై యుంటారు. అదీగాక ఆయన ప్రవర్తనని అనుక్షణమూ మీరు గమనించవచ్చు. నాకు కొత్తగా పెళ్లయిన రోజులలో అప్పుడప్పుడు జబ్బు పడినట్లుగా కనబడడం, లేనిపోని అనుమానాలకిలోను కావడం, ఎందుకో తెలుసా, బెర్రిక్కుని నగరవాసంనుండి తప్పించి బయటికి తీసుకుపోడానికే?

ఆయన ఇట్టే బుట్టలోపడిపోతారు. అయినా ఆయన డబ్బు దండగ ఎప్పుడూ చెయ్యలేదు. ఆ విషయాల్లో మాత్రం అతి జాగ్రత్తగా ఉంటారు!

విం.స:-(అద్భుతగిలి) రాణీగారు, రాణీగారూ ఇది అసంభవం! (లేచి 'సి' వైపుకి వెళ్లి) మాకు పెళ్లైరెండేళ్లే అయ్యింది. మా బిడ్డకి ఆరునెలలుకూడా నిండలేదు ('ఎల్' టేబిల్ దగ్గిర 'ఆర్' కుర్చీలో కూలబడుతుంది.)

బె రా:-బుల్లిబుల్లిబిడ్డ! బిడ్డ కులాసాయేనా? అబ్బాయా, అమ్మాయా? అమ్మాయి అనుకుంటాను - అహఁకాదు, అబ్బాయి అనే జ్ఞాపకం, కష్టమైన విషయమే. ఈ అబ్బాయిలు ఆఖరికి తుంటర్లుగా తయారౌతారు. మా అబ్బాయి చెడు తిరుగుళ్లకి లోటులేదు. వాడు ఎన్ని గంటలికి ఇంటికి వస్తాడో చెబితే మీరు నమ్మరు. ఆక్స్ఫర్డునుండివచ్చి కొద్ది నెలలుకుడాకాలేదు - ఇంతకీ వాళ్లకి అక్కడేమి బోధిస్తారో నాకేమీ అర్థం కావడంలేదు.

విం.స:-మగవాళ్లంతా చెడ్డవాళ్లా?

బె.రా:-ఓ, అంతా, నిస్సందేహంగా అంత మందీను వాళ్లు ఏమీ బాగుపడరు కూడా. వయస్సులో పెరిగినా గుణంలో పెరగలేరు.

విం.స:-ఆయనా నేనూ ప్రేమించీ పెళ్లీ చెసుకున్నాం.

బె.రా:-అవును, అంతా అలాగే ప్రారంభిస్తాము. బెర్రిక్ చీటికి మాటికి ఆత్మ హత్య చేసుకుంటానని బెదిరిస్తూ వచ్చి నందువల్లే ఆయన్ని నేను పెళ్ళాడ డానికి ఒప్పుకున్నాను. పెళ్లయ్యి ఒక సంవత్సర మయ్యిందోలేదో ఆయన ప్రతీ స్త్రీ వెంటబడేవాడు, గానుపిమ్మా కాస్త ఒంటివంపులూ కనిపిస్తేచాలు ఇంక వెంటబడవలిసిందే. మా పెళ్ళి మోజు తీరిందోలేదో అప్పుడే, ఆయన- మా పనిమనిషి, బలే అందంగా ఉండేది, మంచిగుణంకూడా, మీదకన్ను వేసేడు. నేను తక్షణం ఆమెను పనినుండి తొలగించాను - ఆఁ. కాదు, దానిని మా చెల్లెలింటికి పంపించాసేను. సర్ జార్జికి చూపంతగా ఆనదు కాబట్టి మరేమీ పర్వాలేదనుకున్నాను. అయినా అను కోనివిధంగా ముప్పువచ్చింది. (లేస్తూ) అమ్మా నేనిక వెళ్ళాలి, ఇవేళ బైట భోజనం. అయినా ఈ విండర్‌మియర్ వ్యసనాన్ని అంతగా మీ మనస్సుకి పట్టించుకోకండి. దేశాటనానికి తీసుకు పొండి, ఆయనే సరైన తోవలోకి వస్తారు. మీకు దక్కుతారు.

విం.స:-నాకు దక్కడమా?

బె రా:-అవునమ్మా. ఈ చెడుముండలు మన భర్తల్ని మనదగ్గరనుండి లాక్కుపోతారు. అయినా వాళ్లు ఒళ్లు గుల్ల చేసుకున్న తర్వాత మనదగ్గరకే వస్తారు. ఆయనతో మాత్రం ఈ విషయమై కలహించకండి. కలహిస్తే ఇంకా రెచ్చిపోవచ్చు.

విం.స:-మీరు దయతో వచ్చి ఈ సంగతి చెప్పినందుకు నేను చాలా కృతజ్ఞురాలిని. మావారు నాకిలాగ ద్రోహం చేస్తారని నేను నమ్మలేకుండా ఉన్నాను.

బె.రా:-పాపం! నేనూ ఒకప్పుడు అలాగే అనుకునేదాన్ని. అయితే ఇప్పుడు పురుషుల్ని ఎంత మాత్రమూ నమ్మకూడదు అనే పరిస్థితికి వచ్చాను (వింటర్ నియర్ సతి గంటకొడుతుంది.) అయితే ఒకటి అటువంటివాళ్లని చక్కని భోజనం వల్ల మభ్యపెట్టాలి. మీలాటి చక్కని వంటకత్తె అనన్య సామాన్యమైన కార్యాల్ని సాధించగలదు. మీకు పాపం కళ్ళనీళ్ళ పర్యంతం అయినట్లుంది.

విం స:-మీరేమీ విచారపడకండి. చీటికి మాటికీ కంటతడిపెట్టే అలవాటు నాకు లేదు.

బె.రా:-మంచిదే. సాధారణ స్త్రీలు ఏడిస్తే పర్వాలేదుగాని, అందమైన స్త్రీలు తరుచు ఏడిస్తే వాళ్ల అందానికి భంగం కలుగుతుంది. అవున్నాయీ అగాతా!

అ.కు:-('ఎల్'ని ప్రవేశించి) ఏమమ్మా?
(ఎల్ సీ టేబిల్ వెనకాల నిలబడుతుంది.)

(సశేషము)

 



కుమారి పుల్లాది వసుంధరాదేవి.

ఇటీవల జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి త్రైవార్షిక నవలారచనా పోటీలలో ఈమె రచించిన "రంజాపూర్ రాణి" నవల ... బహుమతి పొంది యింటర్మీడియట్ పరీక్షకు పఠనీయ గ్రంథముగా నిర్ణయింపబడినది. ఇంతకు ముందీమె రచించిన "దూరపుకొండలు" అను సాంఘిక నవల బి. యే. కు పాఠ్యగ్రంథముగా నిర్ణయించినారు. ఈమె కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా కేసరపల్లి అగ్రహారం కాపురస్థులు, శ్రీ పుల్లాది లక్ష్మీనారాయణగారి కుమార్తె. వయస్సు 19 సంవత్సరములు.

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారించి, విషక్రిమి నాశనియై త్వరితంగా పనిచేస్తున్నలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్ల పగుళ్లు, ప్రమాదాలు మొదలైన వాటిని సమర్థవంతముగా ప్రత్యేకంగా పనిచేస్తుంది.






## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్



తయారీదార్లు.

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెంసీస్ - విజయవాడ, సికింద్రాబాద్,

బరంపురము (గంజాం), బొంబాయి.

# ప్రముఖుల సంతాప సందేశములు



శ్రీ కేసరిగారి జీవితము కడుధన్యతమము. ఆంధ్ర మహిళా సంఘమీ దురదృష్టవంతమయినది. బీదతికముతో ప్రారంభించిన జీవితము మహదైశ్వర్య సంపన్నమగుట సుకృతవిశేషము. కాని, పరోపకారార్థము అట్టి జీవితమును నడుపుట అసామాన్య విషయము. అతనియాత్మ యత్యుత్తమ స్థానమునఁ బ్రశాంతిఁగనుచుఁ జిరతముగ వెలయఁగలదు:—

"అకటా ! మృత్యువ, కేసరింగొనెదు క్రౌర్యంబూని, నీవాత వే
సికొనంజెల్లునె? ఘోరపాపమనియేఁ జింతింపవే? యింక నాం
ధ్ర కళాభిజ్ఞ పురంధ్రులశ్రువులు చిందన్నిన్ను శాపింతు, రూ
రక వోదయ్యది, నిన్నుఁగట్టి కడుఫుఁ రక్షింప దిక్కెవ్వరే?॥

(హృదయావేగము నిర్విణ్ణునిగఁజేయుట - నేమివ్రాయుటకును బాలువోకున్నది.)

వేదము వేంకటకృష్ణశర్మ, కోడూరు.



శ్రీ పురుషార్థపరులైన — కేసరిగారి నిర్యాణవార్తవిని మా ఆశ్రమవాసులందరు దుఃఖాంజలులతో భాష్పతర్పణ మొనరించి శ్రీవారి సద్గుణముల స్మరించి, స్మారకసమావేశము నొనరింపబడెను. పరిశుద్ధాంతః కరణగల్గి దేశోద్ధరణ మొనరించి స్త్రీజనాభ్యుదయమునకై శ్రీవారి జీవితము సార్థకపడుట గొప్ప సుకృతమైయున్నది. శ్రీవారు చిరస్మరణీయులై ఆ చంద్రార్క స్థాయియైన కీర్తిని గడించిన యశోధనులు.

శ్రీ గురుకులాశ్రమము, చిలుమూరు



ఆంధ్ర రాష్ట్ర స్థాపనముకనుచూపుమేరలోనుండగా ఇట్టి మహాశయుడు పరమపదించుట నిజముగా ఈ జాతి చేసుకొన్న మహాపాపఫలమనుకొనవచ్చును.

అందును స్త్రీ జాతికికల్గినలోప మింతింతనరానిది.

నారీజనోద్ధరణమునకై యీమహాపురుషుడొనర్చినసేవ యిప్పటిలో ఇంకెవ్వరును చేసియుండలేదు.

ఇట్లు విచారముతో
డా. లక్ష్మీకాన్తమ్మ, బాపట్ల.

♦ ♦ ♦ ♦

కేసరిగారు ధన్యజీవులు, స్వార్థరహితులు. నిరంతరసంఘ, దేశ, క్షేమాభిలాషి. అతని జీవితము మహత్తరమైనది. స్త్రీ జనాభ్యుదయమున కాతడు జీవకర్ర. భగవంతు డాతనికి మనశ్శాంతి ప్రసాదించుగాక!

పి. ఆర్. సారధి, మద్రాసు.

♦ ♦ ♦ ♦

ఆయన కృతార్థుడైన జీవియే. కష్ట సుఖముల నన్నిటిని చవిచూచి తాననుభవించి, బంధు మిత్రుల నందరినితన్పి సంతోషముగా కాలము గడిపినాడు. "విశ్వదాత" కన్న మించిన దాతయై -శాశ్వత రూపమున చూపిచెప్పగల దాన ధర్మము గావించినారు. కర్మావశేషమును నాల్గు సం॥లుగా వ్యాధిరూపము అనుభవించి అదియు నిరవశేషముగావించుకొని ముక్తుడైనారు. కావున కృతార్థ జీవియై గతించినవారికై వగవ నక్కరలేదు. అయితేసాంగత్యమునకల్గిన రుణా అనుబంధముకొలది వియోగమునకు కొంత కాలము దుఃఖింపక తప్పదు.

రా॥ వెంకటప్ప, టంగుటూరు.

♦ ♦ ♦ ♦

I am extremely grieved to hear of the death of Sri Kesari, the founder of the Kesari High School and the munificent donor of its endowments. This loss to the school is irreparable. We can only wish that those who are entrusted with the endowments will be animated by the spirit of the founder of the schools.

**Alladi Krishnaswami.**
Madras.

స్వయంకృషిచే స్వయంప్రతిభచే ధనమార్జించి ఆ ధనమును సద్వినియోగ మొనర్చుటచే కీర్తి ప్రతిష్ఠల నార్జించిన ఆంధ్ర ప్రముఖులు శ్రీ కేసరిగారు - ముఖ్యముగా గృహలక్ష్మి పత్రికా స్థాపనవల్లను, కంకణ సత్కారాదులవల్లను, కేసరీ కన్యా విద్యాలయము నెలకొల్పుటవల్లను ఆంధ్ర మహిళలకు వారొనర్చిన మహోపకృతి వెల కట్టరానిది. మద్రాసులో తెనుగు బాల బాలికల కొఱకై వారు స్థాపించిన విద్యాలయములు - వారిపాలిటి కల్పవృక్షములే అని చెప్పవలెను. భగవద్దత్తమైన ద్రవ్యమును సముయోచిత వితరణచే కేసరిగారు సార్థక మొనర్చిరి. వారు ధన్యజీవులు - లబ్ధప్రతిష్ఠులు. ఇంచుమించు సహస్రమాసములు జీవించి త్యాగభోగములచే జీవితమును సార్థక మొనర్చుకొనిన వారి ఆత్మకు శాంతి కలిగినదనియే భావించెదను.

ఇకమీదటకూడా వారిచే స్థాపితమైన సంస్థలు చక్కగా నిర్వహింపబడుచు వారి కీర్తిని శాశ్వత మొనర్పగలవని భావించుచున్నాము.

కనుపర్తి వరలక్ష్మమ్మ, బాపట్ల.

♦ ♦ ♦ ♦

ఆంధ్ర మహిళలకు పితామహుడగు కేసరిగారు అకస్మాత్తుగా మా మధ్యనుండి దివి కేగినారని పత్రికలోజూచి నిర్వెరపోతిమి.

వారి సేవాభాగ్యము, మహిళలకు దూరమైనను - వారిదివ్య ఆత్మతేజోబలముతో గృహలక్ష్మి సర్వకాలములు మహిళాత్మకు - మణులవెల్లులు - విజ్ఞాన వికాసములు నందించుచుండునని మా విశ్వాసము.

స్త్రీ జాతికి శరీర ఆరోగ్యముల చక్కబఱచి - మంచి సంతానముచే ఆంధ్రావనితల నలంకరించ - లోధ్ర మొదలైన ఔషధములు వారి వైద్యానుభవముచే గనిపెట్టి చాలమేలుచేసిరి. అంతటితో తృప్తిజెందక - మహిళల మనోవికాసము ఆత్మ విజ్ఞానము గల్గుటకు మాసపత్రికను ఎన్నో సంవత్సరముల క్రిందటనే స్థాపించి, విద్యాక్షేత్రములో - మహిళామణుల సన్నెలలు వెలిగింపజేసిరి. శాస్త్రజ్ఞానము - ఆత్మజ్ఞానము. శరీరారోగ్యము అమూల్యగముగ మహిళను ఉన్నత స్థానమునకు తెచ్చి, స్త్రీలో ఆత్మవిశ్వాసము గలిగించి - సంఘములో, రాజకీయములలో - ప్రతిజీవిత క్షేత్రములో - ఒక నూత్న స్థానము నిచ్చినట్టి మహామహుడు. వారి ప్రోద్బలముచే - ఎందరో తమ గృహము ఉండి విద్యావాసనలేక పితామహులుగల్గిన తల్లులను [illegible] ఎందరో

నూత్నోత్తేజము స్త్రీ జాతికి గల్గించిరి. మహిళాకాశమునుంచి అట్టి దివ్య వెలుగు సంధ్యారుణ కాంతులమధ్య ఆంధ్ర రాష్ట్రము వచ్చిన వెంటనే దీని పరిణామముల దిల కించకుండనే వెళ్లిపోయినందుకు మా హృదయములన్నియు మేఘావృతములై - శోకాగ్ని మెరపులతో - మహారణ్యములో నున్నట్లుగా తోచుచున్నది.

ఈ సమయమున సకల మహిళలు మనపితృ సమానులు - గురుమహాశయులు, విద్యాదాతలు ఆరోగ్య ప్రదాతలైన కేసరిగారి దివ్యాత్మకు శాంతి సుఖములు గల్గుగాక యని ఆ యనంతసత్యాత్ముని ప్రార్థింతుముగాక!

వాశిరెడ్డి సుశీలాదేవి, తుమ్మపూడి.

♦ ♦ ♦ ♦

గృహలక్ష్మి స్థాపకులగు శ్రీ కేసరీమహాశయుల మరణవార్త పిడుగుపాటువలె దాకి మామనస్సును కలవరపెట్టినది. ఆంధ్ర స్త్రీజనోద్ధరణకై యనవరతము కృషి సల్పి తమ జీవితాంతమువరకేగాక తరువాతగూడ స్త్రీల పురోభివృద్ధి మార్గముల నిర్మించి కీర్తిశేషులైన కేసరిగారి కాంధ్ర స్త్రీలోకము ఋణపడియున్నది. జాతస్యమరణం ధృవమ్మను సూక్తి ననుసరించి ప్రతిజీవియు కాలనియతిని దప్పనేరరుగాన వారియాత్మకు శాంతినిచ్చుటకై పరమేశుని ప్రార్థింతును.

ఇట్లు

దేశిరాజు భారతీదేవి, బాపట్ల.

♦ ♦ ♦ ♦

శ్రీ కేసరిగారు దివంగతులైనారని వినుటకు ఎంతయు విచారకరముగా యున్నది. వారు ఉదార స్వభావులు, కళాపోషకులు, విద్యాదాన సంపన్నులు. లుబ్ధచక్రవర్తులకు ఎంతమందికో మార్గదర్శకులుకూడా ఐయున్నవారు. వారి ఆత్మకు శాంతి కలుగుగాక యని దేవుని ప్రార్థించుచున్నాను.

చివుకుల రామకృష్ణయ్య, నాగులుప్పలపాడు.

♦ ♦ ♦ ♦

Vijayavada shares your grief at the loss of a great benefactor. Such philanthropists are badly needed today

**Dr. Chalapathi Rao,**
Municipal Chairman Vijayavada

డాక్టర్. కేసరిగారి నిర్యాణం విషయం నేను ఆఫీసుకువచ్చిన పిమ్మటగాని తెలిసిందికాదు. అందుచేత స్వయంగా రాలేకపోయినాను. పైగా ఆ నాడు వారిని గురించి వ్రాయవలసిరావడంచేతకూడా, రావడానికి వీలుకాలేదు. డాక్టరుగారు తెలుగు దేశానికేగాక, ప్రత్యేకించి మన ఒంగోలు తాలూకాకు చెందినవారనికూడా భావిస్తూ నేనెంతో ఆనందిస్తుండేవాణ్ణి. వారి జీవితం ధన్యం. మనకు వారులేని కొరతతప్ప వారికి ఏకొరతా లేదు.

నీలంరాజు వెంకట శేషయ్య, మద్రాసు

♦ ♦ ♦ ♦

డాక్టరు కేసరిగారు చాల ఉదార స్వభావులు, నెమ్మదిగలవారు, ఏమాత్రము తొందఱపడక, విసుకించక దీనులు చెప్పుకొను మాటలను బహుసావధానముగావిని తమకి తోచినరీతిని తప్పక సహాయముచేసిన మహానుభావులు. త్యాగులలో కాశీనాధుని నాగేశ్వరావుగారికంటె శుద్ధమైన వర్గమునకు చెందినవారు కేసరిగారు. స్వోత్కర్ష కోసంచేసిన త్యాగం మచ్చునకైన కేసరిగారు చేయలేదు. ప్రతిదానము మనఃపూర్వకముగా సాధ్యమైనంతవరకు రహస్యముగా చేసినదేనని చెప్పవచ్చును.

పి. జి. కృష్ణమూర్తి, వానపాముల.

♦ ♦ ♦ ♦

శ్రీ డాక్టరు కే. ఎన్. కేసరిగారి మరణవార్తనుచదివి దుఃఖాక్రాంత మనస్కుడనైతిని. ఆమహనీయుడు జరాభారయుతమైన శరీరమునుబాసియు, ఆయనపేరనే విరాజిల్లు కేసరీ ఉన్నత పాఠశాల, కేసరీ కన్యావిద్యాలయము, త్యాగరాయనగరమున తెలుఁగు మాధ్యమిక పాఠశాలాది సంస్థలు ఆయన యశఃకాయునిగాఁజేసివైచినవి.

ఆకుండి వెంకటశాస్త్రి, తిరుపతి

♦ ♦ ♦ ♦

శ్రీ కేసరిబాబుగారి మరణవార్త మాకు అశనిపాతమయింది. గృహలక్ష్మి సాహిత్యలోకంలోని ధృవతార రాలిపోయింది. అయినా వారు కీర్తి శరీరంతో మనకు ప్రత్యక్షులు.

స్థానాపతి రుక్మిణమ్మ, విశాఖపట్టణం

♦ ♦ ♦ ♦

ఆదర్శజీవి శ్రీ కేసరిగారి అస్తమయం మమ్మల్ని దుఃఖసముద్రంలో ముంచివేసింది. మాకంతకు పట్టుకొమ్మగా వుండినటువంటి మహాపురుషుడు చేజారిపోయాడు. వీరి మరణం వల్ల లోకానికంతకు - ముఖ్యంగా ఆంధ్ర స్త్రీ లోకానికి తీరని నష్టం కల్గింది.

వి. వి. నరసింహం, నాయుడుపేట

డాక్టర్. కే. యన్. కేసరిగారి మరణవార్త ఆంధ్రపత్రికయందుచూచి మేమెల్లరము చాలా విచారము జెందితిమి. వారు గొప్ప వ్యక్తి శరీర కష్టముచే లక్షలాది ద్రవ్యము నార్జించిరి. అనేక దానధర్మములొనర్చి స్త్రీలకు ప్రతిసంవత్సరమున సువర్ణ కంకణములొసగిరి. వారిచే నడుపబడుచున్న గృహలక్ష్మి స్త్రీ లోకమున కెంతయో నుపకరించుచుండెను. వారికి గానవిద్యయందును మిక్కిలి అభిమానమేగాక విద్వాంసులను కొందరని సత్కరించిరి. కొన్ని విద్యాలయములు స్థాపించి వాటికి లక్షలాది దానమొసంగి వారిపేరు ఆచంద్రార్కముగ నుండులాగ చేసికొనిరి. స్తూలము వారికీర్తి చిరస్థాయిగా నుండును.

నిరాఘాటం రామకోటయ్య, తాంబ్రం.

♦ ♦ ♦ ♦

శ్రీ కేసరిగారు 8-6-53 తేదీ సోమవారము ఉదయము 7 గంll కు పరమపదించినారనువార్త ఆంధ్రలోకమునకు హృదయ విదారకమైనది. కేసరిగారి నిర్యాణమునకు ఆంధ్రమహిళాలోకము అలమటించకపోదు. మద్రాసునందు వీరు తెలుగువారలకు గల్గించిన భాషావకాశములను మరువలేము. స్త్రీలోకమునకు వారు గావించిన సేవయూ అపారము. గృహలక్ష్మిపత్రికానిర్వహణము అమోఘము. అట్టి మహోదారులను కోల్పోయిన ఆంధ్రజనని దుఃఖమునకు అంతులేదు. వారి ఆత్మ కనంత శాంతి చేకూరగలందులకు మాభారత కన్యావిద్యాలయ పక్షమున భగవంతుని ప్రార్థించుచున్నాము.

యన్. వై. పి. తిలకమ్మ, తాంబ్రం.

♦ ♦ ♦ ♦

కీ. శే. డాక్టరు కే. యన్. కేసరిగారు ఆంధ్రావనికి చిరపరిచితులు. మహిళా లోకమును సముద్ధరించిరి. పేరుపొందిన విదుషీమణులను, విద్వాంసులను, నిరుపేదలను ఎందరనో ఆదరించిరి. ఎన్నో గ్రంథములు వెలువరించుటకు శ్రీ కేసరిగారే కారణము. వారి ఆదరాభిమానములను చూరగొని ఎందరో మహిళామతల్లులు, ఉన్నతస్థితి నందుకొనిరి. అట్టివారు దివంగతులగుట ఆంధ్రావనికి తీరనిలోటు. వారి ఆత్మ శాంతినొందుగాక!

డి. స్వర్ణాంబ, మద్రాసు

♦ ♦ ♦ ♦

డాక్టరు. కే. యన్. కేసరిబాబుగారిని యెరుగని ఆంధ్రులుండరు. శ్రీ కేసరిగారు స్వయంకృషివలన సాధారణ జీవితమునేగాక, సకలభోగ భాగ్యములనుభవించిరి. వీరి

ఆశయములు ఉత్కృష్టములు. పట్టుదల అచంచలము. ఆశీస్సు లమోఘములు, అనుపమానములు. వీరి దానధర్మములను లెక్కించుట అనవసరము. వీరి జీవితము ఐశ్వర్యవంతులైన ఆంధ్రులకు ఆదర్శప్రాయము. సాధారణముగ ఐశ్వర్యవంతులకు, కండ్లు మస గ్రమ్ముటగలదు. లక్ష్మీదేవి తమ్మువరించినదని నూగులాడుదురు. శ్రీ కేసరిగారు అట్లుగాక, దానమునందె కంకణముదాల్చి, సుప్రసిద్ధ వదాన్యులై, ఆంధ్రావని కశేషసేవ యొనర్చి యిటీవల తమ భౌతికదేహమును చాలించిరి.

మద్రాసు ఆంధ్రులకు అమోఘమైన సేవయొనర్చి విద్యాభిక్షపెట్టిరి. ఆంధ్రభాషాభ్యుదయమునకు మహిళాభ్యుదయమునకు ఎనలేనికృషిసల్పిరి. వారి 'గృహలక్ష్మి' ఎందరనో మహిళలను రచయితలుగ తయారుచేసినది. సాహిత్య రచనలను ప్రోత్సహించుటకు, "స్వర్ణకంకణము"ను వీరు ఏటేట విదుషీమణికి బహూకరించుచుండిరి. చివరి రోజువరకు, సంపాదకత్వము వహించి పత్రికను అమోఘముగనడపిరి. వారులేనిలోటు ఆంధ్రావనికి తీరనిలోటు. వారి ఆత్మ శాంతించుగాక !

కేసరిబాబుగారూ! వదాన్యశేఖరా!

అనఘ ! నినుధారుణీ గర్భమాహరింపఁ, బొరలికొనివచ్చు దుఃఖంపు తెరలనణచి
పరమసంప్రీతి నశ్రుతర్పణ మొనర్చినార, మాత్మశాంతించుడ నారతంబు ॥

'కవిచంద్రులు' కోటసోదరకవులు (అష్టావధానులు)

◆ ◆ ◆ ◆

# Condolence resolution on the passing away of Dr K. N. Kesari

The Governing Body records its profound sorrow and sense of irreparable and overhelming loss at the passing away of Dr. K. N. Kesari on 8-6-1953, the Founder of the Society and the Educational Institutions that so appropriately bear his name. In making large and impressive benefactions for the cause of education for Telugu children, Dr. Kesari has laid the entire Andhra public of the city under a debt of deep gratitude and has set an example of social sense and public service which, the Governing Body trusts, will be followed by others. Dr. K. N. Kesari has passed away full of years and honours, leaving behind him, a memory of life well lived and a fortune well spent for public good.

ALLADI KRISHNASAMY,
*President*,
Kesari Educational Society,

# శ్రీ విజయనామ సంII ర జ్యేష్ఠ-ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| 1953 సంII జూన్ నెల | 16 | మం | పం 42-17 ఆశ్లే 32-2 త్యాదివి 2-7 వనగౌరీవ్రతము |
| | 17 | బు | ష 46-46 మఖ 38-58 త్యాదివి 5-30 |
| | 18 | గు | స 51-44 పుబ్బ 45-24 త్యాదివి 1-13 |
| | 19 | శు | అ 56-50 ఉత్తర 52-1 త్యాదివి 5-24 |
| | 20 | శ | న 60-0 హ 58-26 త్యాదివి 15-15 |
| | 21 | ఆ | న 2-57 చి 60-0 త్యాదివి 21-31 |
| | 22 | సో | ద 5-22 చి 7-41 త్యాదివి 21-49 గంగాభగవతీవ్రతం |
| | 23 | మం | ఏ 8-16 స్వా 8-19 త్యాదివి 22-55 |
| | 24 | బు | ద్వా 10-0 విశా 11-44 త్యాదివి 22-5 |
| | 25 | గు | త్ర 10-27 అనూ 13-53 త్యాదివి 28-17 |
| | 26 | శు | చతు 9-36 జ్యే 14-49 |
| | 27 | శ | పౌ ○ 7-36 మూల 14-32 త్యాదివి 10-35 |
| | 28 | ఆ | కృ-ప్ర 4-30 పూ-షా 13-12 త్యాదివి 32-17 |
| | 29 | సో | ద్వి 5-11 ఉ-షా 10-57 త్యాదివి 20-27 |
| | 30 | మం | తృ-చ 0-55 శ్ర 7-55 త్యాదివి 17-19 |
| 1953 సంII జూలై నెల | 1 | బు | పం 44-6 ధని 4-19 త్యాదివి 22-27 |
| | 2 | గు | ష 37-57 శత 4-44 త్యాదివి 19-42 |
| | 3 | శు | స 31-44 పూ-భా 0-53 త్యాదివి 21-41 |
| | 4 | శ | అ 25-43 రే 48-4 త్యాదివి 20-28 |
| | 5 | ఆ | న 19-57 అశ్వ 44-30 త్యారావి 2-51 |
| | 6 | సో | ద 14-59 భర 41-44 త్యాదివి 7-26 |
| | 7 | మం | ఏ 10-36 కృ * 39-48 - త్యాదివి 10-45 |
| | 8 | బు | ద్వా 7-52 రో 38-40 త్యాదివి 19-3 |
| | 9 | గు | త్ర 4-41 మృ 38-46 |
| | 10 | శు | చతు 3-15 ఆర్ద్ర 39-59 త్యారావి 0-12 |
| | 11 | శ | అమా ● 3-14 పున 42-30 రావి 11-14 వటసావిత్రీవ్రతం |
| | | | ఆ షా ఢ మా స ము |
| | 12 | ఆ | శు-ప్ర 2-45 పుష్య 46-14 త్యాదివి 3-45 |
| | 13 | సో | ద్వి 6-56 ఆశ్లే 51-2 త్యాదివి 21-6 |
| | 14 | మం | తృ 10-30 మఖ 56-50 దివి 23-59 దుర్వారణ్య గౌరీవ్రతం |
| | 15 | బు | చ 14-54 పుబ్బ 60-0 దివి 19-53 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd., 15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor : Dr. K. N. Kesari, Ag. Editor : C. C. Punniah.

# గృహలక్ష్మి ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఫిలోమెనాతంబుచెట్టి జీవితచరిత్ర (ఆంగ్లము) | 0-12-0 |
| 2. | నవమణిమాల (నవల, తమిళం) : శ్రీమతి యస్. ఆర్ జయలక్ష్మి | 0-12-0 |
| 3. | వేప (వైద్యగ్రంథము) : శ్రీ కె. యన్. కేసరిగారు | 0-12-0 |
| 4. | బిల్వ (వైద్యగ్రంథము) : ,, | 0-12-0 |
| 5. | అరవింద (నవల) : శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు | 1-0-0 |
| 6. | శ్రీ జ్ఞానప్రసూనాంబికాశతకము : శ్రీమతి గంటికృష్ణవేణమ్మగారు | 0-6-0 |

## మా దగ్గర లభించు గ్రంథము

| | |
|---|---|
| దేవీభాగవతము : శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు | 12-8-0 |

## అచ్చులోనున్నవి

తులసి (వైద్యగ్రంథము) : శ్రీ కె. యన్. కేసరిగారు

నాచిన్ననాటి ముచ్చట్లు : శ్రీ కె. యన్. కేసరిగారు



గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట, మద్రాసు-14.

Lodhra Press, Madras 14